వందేమాతరం

## స్వాతంత్ర్య కుసుమమాల

*** కుసుమము

# శ్రీ గాంధీ భారతము

## బాల్య పర్వము




పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచదుష్కృతాం

# ఉమా బొత్తాములు

**UMA BUTTONS**
GOLD SHEET COVERD
GIVES LIFE LONG SATISFACTION





UMA 718/3

Each Button As. 12/-


UMA. 251


UMA. 252


UMA. 834


UMA. 735

Collar Pin As. 12/-




SHIRT LINKS









బంగారు రేకు కలి
యుక లోహముపైన
కవరింగుచేసి తయా
రుచేయ బడినవి.

జీవిత కాల పర్యంతం
తృప్తినిచ్చును



ఉమాగోల్డు కవరింగు వర్క్సు,
ఉమా మహాల్ — మచిలీపట్నం.

స్వాతంత్ర్య కుసుమమాల

*** తృతీయ కుసుమము.

# శ్రీ గాంధీభారతము

## Vol. II.

## బాల్యపర్వము.

రచయిత:—

**Dr. M. Seshacharyulu**
**L M & S**

మచిలీపట్నం.

**1951. 1000** కాపీలు.

శ్రీ లక్ష్మీప్రెస్సునందు ముద్రితము.



రు ౨-౦౦



# స్వాతంత్ర్య కుసుమమాల

[illegible] ముఖ్యోద్దేశములు
[illegible]యం

[illegible] 1. ఆంధ్ర సారస్వతసేవ.

2. ఆంధ్ర రచయితలసేవ.

వివరములకు సెక్రిటరీని సంప్రదించుడు.—







# శ్రీ గాంధీ భారతమునకు కృతిభర్త ఎవరు?—

## ?

శ్రీ గాంధీమహాత్ముని ఆదర్శములయిన—

జాతీయభావ సంపోషణ—

సోదరానురాగ సంవర్ధనమునకై—

తగుదోహద మొసంగజాలు ఆంధ్ర సారస్వతవృద్ధికై—

వెలయబోవు మాట్రిస్టునకు హిందూ మహమ్మదీయాది సోదరులలో నే మహా వ్యక్తియైనను మహారాజయినను మహామ్మదీయా గ్రైపరులయిననూ— అందరూ ఆంధ్రమాత పుత్రులే— లేక యేసంస్థ అయినను All India Gandhi Mimorial Fund. వారయినను సరే, తగిని భూరివిరాళ మిచ్చువారలు.

గ్రంధకర్త దీనిలో పైసయైనా ముట్టడు—



# ప్రార్థన

భజే భరత మానినీం ।
సమస్త లోక పావనీం ।
అశేష జ్ఞానభామనీం ।
సుధైర్య పుష్పశోభినీం॥

మరందబిందు తుందిలే ।
సుపుష్ప పద్మసంకులే ।
పునీత వారి శీతలే ।
మరాళగమన కోమలే॥

మనోజ్ఞ కుంజమండలే ।
సునాద మధురనాదితే ।
మదీయ కావ్య సద్మనే ।
సదావన యశస్వినీ॥

# స్వతంత్ర కుసుమమాల ప్రచురణలమీద అభిప్రాయములు

1

శ్రీ గాంధీ భారతము— నిర్యాణ పర్వము.

ఆంధ్రపత్రిక 21 వ ఆగస్టు 1949 న ఈ విధముగ గ్రంథ పరిచయమునందు వ్రాసినది:—

స్వతంత్రసముపార్జన జ్ఞాపకార్థముగ, సారస్వత, శాస్త్ర, వైద్య రాజకీయ విషయములనుగూర్చి నూతన గ్రంథములువ్రాసి, దేశ సేవచేయు నుద్దేశముతోను, ఆంధ్రరచయితలకు సాయమొనర్చు ఉదారాశయముతోను, "ఈ కుసుమమాల" ప్రారంభింపబడినది. గాంధీమహాత్ముని దివ్యజీవితచరిత్రను సర్వతోముఖముగా 8 భాగ ములలో మూడువేలపద్యములలో రచింపబూనుకొని, అందు మొదటి భాగముగా ఈసంపుటమును ప్రచురించియున్నారు.

గాంధీమహాత్ముని నిర్యాణమువలన భారతదేశము నందలి ఆబాల గోపాలమునకును కలిగిన దుఃఖమును, ఆవేదనమును పద్య రూపమున వర్ణించుగ్రంథమిది. గాంధిమహాత్మునిహత్య, తరువాత దహనమువరకు జరిగిన కర్మకాండయంతయు గ్రంథమునందు చక్క గా వర్ణింపబడియున్నది. శైలిహృద్యము. ప్రౌఢము.
మచ్చుకు:—

ఉ॥ స్వస్తిజగన్మహాత్మునకు ♦ భారతదేశనవప్రవక్తకు,
భ్యస్త నవీనరాజ్య పరి ♦ పాలనమార్గవిలాస వృత్తికిన్
న్యస్తసమస్త నాగరిక ♦ నాయకమస్తక సత్యసూక్తికిన్।
నిస్తులభక్తి సంభరిత ♦ నిశ్చలతన్ మనసార మ్రొక్కెదన్॥

వీరి సీసపద్యముల పోకడచక్కగానున్నది:-

సీ॥ భారతీయుల ఘోర ♦ పారతంత్ర్యము గూర్చి,
ముందు చూపిన ♦ ముకురతలము।
తెల్లవారల స్వార్థ ♦ తీవ్రస్వరూపంబు,
పొలుపొందబూచిన ♦ కలుషతరువు।
హిందుముస్లిముసంఘ ♦ మందునేకత్వంబు
లలమించుకాకలు ♦ వెలయుతావు॥
హింసాపథంబుల ♦ ధ్వంసం బొనర్చెడు,
ప్రేమవాది మహాత్మ ♦ పెరుగునెలవు।

తే॥ గీ॥ దివ్యమగా స్వతంత్రసతికి ♦ దెల్లముసుగు।
వేసి, ఘోషానుగనరాక ♦ వేయుసీమ।
అట్టిదగు దక్షిణాఫ్రికా ♦ నలరునేత।
రుస్తుమేతెంచె బహుళార్తి ♦ రుద్ధగళుడు॥

గాంధిమహాత్ముని ఉన్నతాశయవ్యాప్తికి, ఈకుసుమమాల తోడ్పడగలదు. వీరి సదుద్యమమునకు నెల్లరు దోహదమొసంగ దగును.

* * *

2

నవజీవన పత్రిక యిట్లు వ్రాయుచున్నది.

స్వతంత్ర యుద్ధం.

చేతితో చేయబడ్డ కాగితాలపై, భారతస్వతంత్ర పోరాటములోని వివిధఘట్టాలను, పర్చికూర్చి, పద్యాలుపాటలతో, నాట్యనాటక స్వరూపాన్ని [Dance drama] రచించిన గ్రంథం

ప్రదర్శన యోగ్యంగా పంజాబుదురంతములు, జలియన్ వాలా బాగ్, ఉప్పుసత్యాగ్రహము, రెండవప్రపంచ యుద్ధం, క్విట్ యిండియా ఉద్యమం, నేతాజీ అజాద్ హిందుఫౌజు, నేతాజీమరణము, బ్రిటీషువారు భారతావనిని చీల్చి పాకిస్థాన్ సృష్టించుట, స్వతంత్ర సిద్ధి, అంతయు చక్కగా వర్ణింపబడ్డాయి. వెల 1–0–0 స్వాతం త్ర్యకుసుమమాల, మచిలీపట్నం.

శ్రీ గాంధీభారతము, నిర్యాణపర్వము.

* * *

గాంధీజీ నిర్యాణము, అందులకు గాంధీఆశ్రమంలోని బాల బాలికలవిలాపము, హంతకునిదూషణ, ప్రపంచములోని వివిధ ప్రముఖులు గాంధీజీహత్యపై తెలిపిన అభిప్రాయాలు, గాంధీజీ దహనక్రియాదులన్ని పద్యాలలో వ్రాయబడినవి. పద్యాలు ధారాశుద్ధి గల్గి, గాంధీభక్తులందరును నిత్యము పారాయణజేయ నర్హమైనవి.

3

శాంతిపత్రిక 30–5–49 యందీక్రింది విధముగా నభిప్రాయమును వెల్లడించినది:–

శ్రీ గాంధీభారతము, నిర్యాణ పర్వము.

మహాత్ముని మరణసమయమునుండి, సంచయనమువరకు వర్ణించబడినది .... .... .... .... ....

'పవిత్రమైన చరిత్ర' పవిత్రమైన కవిహృదయము, పవిత్రమైన కాగితము–ఇంతకంటె వాంఛనీయమేదికలదు? .... ....” అను శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు యమ్. ఏ., ఆంధ్ర యూనివర్సిటీ ఆంధ్రశాఖాధ్యక్షులుగారి అభిప్రాయముతోను,

శ్రీ నాదెళ్ళ మేధాదక్షిణామూర్తి శాస్త్రిగారు దెల్పిన,

మ॥ అజరానంతదిగంత నిర్మల యశోవ్యాప్తి స్ఫురత్ సత్కృప లో
కజనారాధ్యము "గాంధిభారత" మనంగా, నీమరంగంటి వం
శజ శేషాహ్వయ కర్తృకంబుచితమౌ సానంబుదానొంపుగా
త, జయంబబ్బుత,మా సతీర్థ్యునకు మేధాస్ఫూర్తిపెంపొందుతన్॥

పై అభిప్రాయములతో మేము పూర్తిగ ఏకీభవించు చున్నాము.

---

## 4

రిటైర్డు తహసిల్దారు ఉ॥ వే॥ ప్రవర్తకులైన శ్రీమాన్ గొట్టుముక్కల రమాకాంతాచార్యులు బి. ఏ. గారు ఈ క్రింది అభిప్రాయములను 3, 13-12-49 యందు కృపచేసిన లేఖలలో వెల్లడించిరి.

తా॥ 12-12-49.

స్వామినః దాసోహములు ఉభయకుశల ప్రసంగోపరి. .... ....
.... ....గాంధీభారతము బాల్యపర్వము సిద్ధమైనదని, జనవరి 26వ తేదికి అచ్చుకానున్నదని వ్రాసినందుకు చాలసంతోషముగానున్నది. గాంధీమహాత్ముడు భారతీయస్వాతంత్ర్యమును గడించిన యుగ పురుషుడు. వైదికధర్మ విషయములలో ఆయనతో ఏకీభవింప జాలక పోయినను ఆయన సంపాదించి యిచ్చిన ఆర్యావర్త స్వాతంత్ర్యము అమూల్యమైనది.... .. మీరు వ్రాసిన ప్రబంధము ఆంధ్రరాష్ట్రములో పూజ్యస్థాన మలంకరింపనున్నది. కథావస్తువు మహనీయము మీకవిత లలిత శైలీ సముల్లసితము.... .... ...

శ్రీగాంధీభారత నిర్యాణపర్వమును పఠించి, యందలి కరుణ రసముచేతను, ఆత్మపులకింపగా ఆఅనుభవము వెల్లడింపననువు పడుటలేదు. ఐనను ఈ క్రింది పద్యమును వ్రాసికొని, నా ఆనం దములో కొంతశబ్దమయముగా వెల్లడింపదలచి, ఈ పద్యమును బం పుకొనుచున్నాను.... .... .... ....

మ॥ అనుగుంబౌస పవిత్రమయ్యెజుని. గాంధీభారతంబున్ రచిం।
చిన మీ కైత బెడంగుచేత, ననఘా! శేషార్య, నిర్యాణ చి।
త్రిణ గాంధీమృతి సంస్మృతింగరుణగీ ♦ తన్ బాడ, భూదేవతా।
పరిణాహాని మహా సాకారించెడి రసా ♦ స్వాదాత్తి ముగ్ధాత్మకన్॥

అచిరకాలమున మీ భారతము పూర్తి చేయ శ్రీ శ్రీనివాసమూర్తి అనుగ్రహించు గాక!

—o—

5

శ్రీ పింగళి లక్ష్మీకాంతము యమ్. ఏ., గారు ఆంధ్రయూనివర్సిటీయందు, ఆంధ్రభాషా డిపార్టుమెంటునందును, రీసర్చిడిపార్టుమెంటునందును ప్రథములుగా పనిచేసి, రిటైరైన విఖ్యాత పురుషులు

వీరి అభిప్రాయము నిర్యాణపర్వమునందు పూర్తిగా వెలువఱచియున్నాము. వానియందలి ప్రధానాంశములను ఆపుస్తక ప్రచురణకు తర్వాత నొసంగిన యభిప్రాయములను ఈ క్రింద పొందుపరచుచున్నాము:—

* * *

కవి మొదటినుండియు మహాత్మునియెడ, అవ్యాజభక్తి నెరపిన నిష్కలంక కాంగ్రెస్‌వాది కనుక, ఈయనకు ఈ తలంపు కలుగుట వింతకాదు. అసలు గాంధిజీని గురించి ప్రసంగించుటకు గాని ఏమేమి వ్రాయుటకు గాని. యిట్టిసాధుశీలులే యర్హులు.... పవిత్రమైన చరిత్ర పవిత్రమయిన కవిహృదయము, పవిత్రమయిన కాగితము — ఇంతకంటె వాంఛనీయమేమికలదు? నామిత్రుడు అచిరకాలములో గ్రంథమంతయు పూర్తిచేయునని ఆశించుచున్నాను. లోకము ఈయన సత్సంకల్పమును ఆమోదించునుగాక.

29-5-49.

I dont quite remember why I omitted making any mention of your style in my opinion. Now I express it. It has epic simp icity. I have seen the manifesto, of ycur Granthamala. Your aim is laudable.

(Signed) P. Lakshmikantam.

**6**

(బ్రహ్మశ్రీ) నాదెళ్ళ మేధా దక్షిణామూర్తిశాస్త్రులుగారు. వీరి యభిప్రాయము విపులముగ నిర్యాణపర్వము తొలిపలుకునందు కననగును. ముఖ్యాభిప్రాయము స్థాలీపులాకన్యాయముగ ఈక్రింద బొందుపరచుచున్నాము.

* * * * *

ప్రస్తుత కథావస్తువే కరుణామునకరవైనదయ్యెను. తానా కథానాయకునెడ భక్తిభావంబు మీఱ బరితాపపూరిత హృదయుండై వ్రాసినయదియయ్యె. ఇంక రసోదయమునకు దావలములైనవి యుండకుండునా? అట్టివి పాఠకులకే పొడగట్టదగుగాన నిందుదాహరించి విసువొందింపను.... గుణగ్రాహదక్షులౌ విచక్షణు లిద్దా నిబరికించి యీ కుసుమము శిరోధార్యముగా నెంచి, యీతని పూనికనింక గొనసాగించెదరుగాత .... ... ... ...

[digneS] నాదెళ్ళ మేధా దక్షిణామూర్తిశాస్త్రి

**7**

బ్రహ్మశ్రీ భాగవతుల కుటుంబరావుగారు యమ్. ఏ., శిరోమణి, విద్వాన్, నేషనల్ కాలేజి, మచిలీపట్నం 29-8-50 న ఈ అభిప్రాయములనొసంగియున్నారు.

శ్రీ అభినవ గుప్తపాదుల యభినుతి పాత్రము శాంతరసము. సంచారిభావముల సర్వాగ్రగణ్యము నిర్వేదము: శ్రీ మహాభారతము శాంతరస ప్రధానము. శాంతరసము శుభసూచకము

శ్రీగాంధీభారతము నిర్యాణపర్వముతోను, నిర్యాణపర్వము శాంతాశ్రమవర్ణనతోను ప్రారంభమగుట శుభసూచకము. శాంతాశ్రమవర్ణనము శాంతరస సుందరము.

ఆశ్రమబాలబాలికల విలాపము శ్రీకృష్ణనిర్యాణ ఘట్టమును స్మృతికి తెచ్చుచున్నది. కరుణరసమిచట ప్రాణము. ఇటవృత్తౌచిత్యమును పాటించి యీకవిగారుచితజ్ఞులైనారు.

ఉ॥ చేసితిబోఘనుల్ వినియి ♦ సీ! యమునాతీరగప్రగాఢ్య నిరానమెడన్
బూసిన దివ్యపుష్పమయ ♦ భూజము నేటునగూల్చితీయెడన్।
వేసిన సత్యప్రేమలను ♦ పిండె లవన్నియు నన్నితావులన్।
నా సియువన్నెగాంచుతటి ♦ వాడగజేసితి వేల పాపుడా!॥

ఉ॥ అంచితకాంతివంతమయి ♦ యబ్జసమాన విలాసయుక్తమై।
మించెడి సౌధరాజమగు ♦ మేల్మికడాని హారంగులీను న।
భ్యంచిత "టాజి" యాయనగ♦భాసిలు హర్మ్యముజ్జ్వానలోక మం
దెంచక స్తంభవక్రితకు ♦ నీవిధి సౌధవినాశమెంచెదే॥

ఉ॥ ఇంతవిశాల భూమిపయి ♦ నించుకపాలను ద్రావి, పళ్ళ నో।
కింతమెసంగిలోకముల ♦ గీడులడంగను శాంతిగీతికల్।
చింతల బాపబాడుకడు ♦ చెన్నగుకీరకిశోరి నెట్టులన్।
వింతగగోరి కొట్టితివి ♦ వీర్యమొ? నీమది చల్లనాయెనే॥

అను పద్యములు ప్రతిభాజన్యములు.

సీ॥ అతడచే మొనమొన్న ♦ హైందవవ్యధబాప
నూరూర నవకాళి ♦ నోర్మిదిరిగె।
ఆతడచేయిస్లాము ♦ మతమువారలగావ
నుపవాసమీఢిల్లి ♦ నుపగమించె।
అతడచేలాహోరు ♦ నతివల రక్షింప
సరియైన మార్గంబు ♦ జక్కజూపె
అతడచే యాభార ♦ తావని జేల్పంగ,
నదివద్దు వద్దని ♦ యనిమొమొన్న।

గీ॥ ఎల్లకాలంబు నైక్యంబు ♦ నెదనునమ్మి।
సర్వకర్మముల్ దేశంబు ♦ జక్కజేయ।
జేసి రాజ్యాంగసన్యాస ♦ జీవితంబు
గడపి యైక్యంబునకు బ్రాణ ♦ మెడలనిచ్చె॥

సీ॥ దక్షిణాఫ్రికయందు ♦ దనను మోహనమొనర్చె,
నవికొట్టు ముస్లిము ♦ గనెడి నగవు।
పరదేశవస్త్రాల ♦ బావకజ్వాలల
పాల్సేయుపట్టున ♦ బరగునగవు
తన్నవ క్కిద్రోసి ♦ తన్నుచు నుమిసిన,
యతని క్షమించుచో ♦ నమరునగవు
అతిభక్తి నీకోర్కె ♦ నాభరణాలిచ్చు
చిన్నపిల్లగోసరు ♦ వన్నెనగవు।

గీ॥ స్త్రీలు తమమేని నగలెల్ల ♦ దేశమునకు।
నిలువుదోపును గావింప ♦ నిలచినవు।
ప్రేమదళ్కొత్త దీపించు ♦ ప్రియపు నగవు।
గాంచమాయింకగాంచమా ♦ ఘనుని నగవు॥

మొదలగు పద్యములు, భావగాంభీర్యమునకు, సుఖశయ్యాకు వృత్తౌచితికి, ధారాశుద్ధికిని దారాకాణములు.

మహాత్ముని భక్తులీకవులు, గ్రంథమంతటను కవిహృదయము స్పష్టమే. శ్రీగాంధీభారతము, భారతమగుగాక.

[Signed] భాగవతుల కుటుంబరావు
29_8_50



# సంపాదకీయ భూమిక.

ఈశ్వరసంకల్పముచే శ్రీగాంధీభారతియను రెండవవాల్యూము బాల్యపర్వము నిప్పుడు ప్రచురింపగల్గితిమి. మాస్వాతంత్ర్యకుసుమమాలయందలి తృతీయకుసుమము. దీనిసౌరభమాంధ్రావని దశదిశలు నువ్వాప్తమై, సర్వజనమాన్య సాహ్లాదము నొనగూర్చుగాత మని యాశించుచున్నాము. ఈ కుసుమమాలను ప్రైవేటు లిమిటెడు కంపెనీగా రిజిష్టరుచేయు ప్రయత్నములు జరుగుచున్నవి. అవి యచిరకాలములోనే ఫలోన్ముఖమునకువచ్చి, ఇంతకంటెను హెచ్చు భాషాసేవకు మాకును ఇతర గ్రంథరచయితలకును నవకాశముగలుగజేయ గలుగునని తలంచుచున్నాము.

ఏసంస్థయైనను జనబాహుళ్య సమాదరణవల్లనే వర్ధిల్లును. అందుకై యీ కుసుమమాల నిర్వహణమునకు సంవత్సరమునకు మేము ప్రచురించు ఆగు ప్రచురణలకును, కనీసము పదిరూపాయల నుండి. క్రమవృద్ధిపద్ధతిని చందాదారు పోషక, రాజపోషకమహారాజ పోషకుల తరగతుల నేర్పరచి యున్నాము. ఇంతవరకు శ్రీగాంధీభారతి[illegible]గ్రహించిన వారందరును, వారివారి హోదాలనుపురస్కరించుకొని, తగిన తరగతులయందు జేరి తమవార్షికపురుసుములను పంపప్రార్థన. ఇదివరకే పంపినవారికి మావందనములు. పలువురు భాషాభిమానులు, మహారాజపోషక, రాజపోషక శ్రేణుల యందు జేరుటకుద్యమించుచున్నారు. వారించుక తొందరపడిన కార్యనిర్వహణమునందు మాకు చేయూతనొసగిన వారగుదురు. అట్టివారికి మార్గదర్శకులుగా బందరు మినర్వాటాకీసు స్థాపకులలో నొకరయిన శ్రీ కూనపరెడ్డి వి. రాఘవయ్యనాయుడుగారు అడిగిన క్షణముననే రాజపోషకశ్రేణియందు జేరినారని ప్రచురించుటకు గర్వపడుచున్నాము. ఇంతవరకు చందానిచ్చినవారి కందరికిని నితరకారణములచే ప్రచురణయందాలస్యమైనను, ఆగు ప్రచురణల వరకును వారేమియు చందాతిరిగియీయవలసిన అవసరములేదని. విన్నవించుచున్నాము. అగు ఆలస్యముపట్ల క్షాంతిజూపప్రార్థన

కవిశేఖరులకును, గ్రంథకర్తలకును నొక్కవిజ్ఞాపన. ఈ

ఆధునిక కాలమునందు భాషాభూషణములగు [illegible] పుస్తకములను రచి యించినను, బహుబాలబాలికోపయోగములైన వానిని [illegible] తద్గ్రంథప్రచురణచేవచ్చు లాభములయందొక వీసముభాగమైనను తద్గ్రంథరచయితలు పొందుటలేదన్న సంగతి ఎల్లరికిని [విశదము] తెలియనిదికాదు. దీనియందు గ్రంథకర్తలనుగాని, తత్ప్రచురణ కర్తలనుగాని తప్పుపట్టుటకు వీలుకాదు. అధునిక నాగరికతాదర్శములును, జీవిత సంఘర్షణయును (Struggle for existance]. దీనికి కారణములు. ఈ లోపమును తీర్చుటకును, గ్రంథకర్త గ్రంథప్రచురణకర్త లిద్దరును పరస్పర సహాయపరాయణులై, దేశ భాషాసేవ నొనర్చుటకు వీలగు నూతనపంథను ద్రొక్కుటకు మార్గసూచకముగా ఈ స్వాతంత్ర్య [illegible] స్థాపించితిమి. గాన దీనిసూత్రములను మీరు హృదయపూర్వకముగా గ్రహించి ఈ ప్రయత్నమును జయప్రద మొనర్పవలయునని యూహించుచున్నాము. వివరములు శెక్రిటరీగారి నుండి తెలిసి కొనవచ్చును.

మరియు విజ్ఞాన వ్యాప్తికై, జనసామాన్యోపయోగమునకు పెద్దవిషయములను గూర్చి, చిన్నచిన్న పుస్తకములను, ఇంగ్లీషులో 'పెంగ్విన్ సీరీస్' యను శీర్షికక్రింద ప్రచురించి, విశేషవిజ్ఞానవ్యాప్తికి తోడ్పడుచున్నారు. అటువంటి భారతీహస్తాబ్జభూషణములగు వినోదసంయుత విజ్ఞానకుసుమములను కూడను ప్రచురింపమా తలంపు. దానిని ఫలోన్ముఖ మొనర్చుభారము ఆదరణ శీలురగు [illegible] ముమీద నున్నదని వారికి జ్ఞాపకము జేయుచున్నాము.

మరియు మనము స్వతంత్రతాసిద్ధిని బడసితిమిగాన, భావికాలమునందు దేశభాషలవృద్ధి కపరిమితమైన శుభపరిస్థితు లేర్పడినవి భాషపలువిధముల వృద్ధియై, నూతన గ్రంథముల కెంతయో తావేర్పడినది. గాన దానికి నడుములు బిగించి, దేశభాషాసేవ లొనర్చు ప్రయత్నముల కన్నిటికిని మీరో దోహదము నొనర్పవలయుననియు హెచ్చరించుచున్నాము. ఇదే మాప్రయత్నము. దీనిమీరందరును సఫలమొనర్చెదరుగాక.

ఓంతత్ సత్. శాంతిశ్శాంతిశ్శాంతిః

# శ్రీ గాంధీ భారతము

## బాల్యపర్వము.

—: విషయసూచిక :—



—....—

# గ్రంథకర్త యుపోద్ఘాతము

శ్రీ గాంధీ భారతము నందలి రెండవ వాల్యూము బాల్య పర్వమును పాఠక మహాశయుల కందించు చున్నాను. నిర్యాణ పర్వమును ప్రచురించి సంవత్సరము పైబడినది. మహాత్ముని వధ విచారణ తుది యగుటకైన యాలస్యము చేతను దానియందు హంతకుడయిన శ్రీ. గాడ్సే వాఙ్మూలమును గవర్నమెంటు వారు ప్రసిద్ధిబు చేసెదరని యనుకొనక పోవుట చేతను వాని తాత్ప ర్యములను కూడను చేర్పవలయునని యభిప్రాయ ముండుటచే నాల స్యమాయెను. గవర్నమెంటు చర్యవలన ఆప యత్నము విరమింప వలసెను. తదనంతరము కొంచెము దేహ స్వాస్థ్యము సరిగా నుండ కుండుటయు, నాలస్యమునకు కొంత కారణము. ఉదార స్వభావు లైన పాఠకలోకము దీనిని మన్నింతురని తలంతును.

తరువాత నీ బాల్యపర్వము నందరికి తెలిసిన నిత్య బాహ్య జీవన విశేషముల, మహాత్ముని స్వీయచరిత్ర యందును, నితరులు వ్రాసిన జీవిత చరిత్రలందును నవి సవిస్తరముగా నుండుటచే వానిని వర్ణింప బ్రయత్నింప లేదు. వర్ణనలవల్ల లాభము విశేషముగా గాన్పింపకుండుటచే నట్లుచేయ బడినది. కాని మహాత్ముని మానసిక ప్రవృత్తి చిన్నతనము నుండియు నేవిధముగ వివిధ పరిణామముల బొందినది 'తెలియ వచ్చినంత తేటపఱచి'తిని. మఱియు నింతవరకు వర్ణింపబడని బాల గాంధీ జీవిత విన్యాసమును మార్చిన హైందవ స్వాతంత్ర్య ప్రథమ సంగ్రామమును (1857వ సం॥ శిపాయి మ్యూటినీ) దానియందలి ముఖ్యాంశములను ప్రథమమున భయము లేకుండ వర్ణింప గగిలితినని కొంత విశేష సంతోషమును బొందు చున్నాను. మఱియుదీనియందు దేశభక్త్యుద్దీపనము కలుగజేయు ఘట్టములకు, కవులీయదగిన వర్ణన సత్కారముల నర్పింపగలిగితినని కూడ సంతసించు చున్నాను. ఆవీరుల మహత్తర త్యాగమును సూచించు నొకచిన్న దీపికగాను వెలిగించ గల్గినందులకు గర్వించు

చున్నాను. వీనిలోని చరిత్రాత్మక విషయములు మహాత్మాగాంధీయ చరిత్ర నుండియె స్వీకరింప బడినవి.

నేనీ శ్రీ గాంధీభారతమును వ్రాయబూనుట మహాకవికాళి దాసకృత– "క్వ సూర్యప్రభవో వంశః క్వ చాల్పవిషయా మతిః" అను శ్లోకమును జ్ఞాపకమునకు తీసికొని రాకమానదు. నేనును ఆ భావమును బొందినటువంటి వాడనేకనుక మహాకవులందఱి నీ క్రింది విధమున నర్థించు చున్నాను. మహాత్ముడు కవిమాతులిల సామర్థ్య ములకు నతీతుడయిన మహా పురుషోత్తముడు. గోపికలు కృష్ణమహా త్ముని వర్ణించి తరించినటుల మన గాంధీ కవితాకన్యలా లోకో త్తమ పురుషు నభివర్ణించి తరింపవచ్చును. మహాత్ముని చరితము నం దతి రసవత్సందర్భములు కలవు. ఏవారలే రసవత్సందర్భమును వర్ణింపవలిగిన, దానినే యేర్పఱ్చుకొని వర్ణింప వచ్చును ఆ భాగము నకు గాని ఆపర్వమునకుగాని వారికర్తృత్వమును నిర్దేశించి ప్రచు రించెదము. కనుక పేర్గన్న కవీశ్వరులందఱును తమ కవితా సర స్వతికి తగు సార్థక్యము నొసంగి ఈభారతమునందు పాల్గొనవలయు నని హెచ్చరించు చున్నాను. నేను పంచవింశతి పర్వ విరాజమాన మగునటుల నీభారతమున గహనద్భాగముల నేర్పరచి యున్నాను. వానిని తెలియజేయుమని కోరినను కవీశ్వరుల కందఱికిని తెలియ జేయ సన్నద్ధుడనై యున్నాను. కనుక నెల్లరును దీనికి దోడ్పడుట వారివిధియని విజ్ఞాపన. ఆవిధమున మనమందరముకు జేరి యుగపురు షుడయిన శ్రీ గాంధిమహాత్ముని దివ్య జీవితగాన మొనర్ప గలిగిన నీగాంధీ భారతముచు పూర్తి జేయునపుడు సందేహ రహితహృదయ ములతో——

సీ॥ కాంగ్రెస్సు వీరులు ♦ కాంగ్రెస్సు చరితన
బ్రద్దరువారు మా ♦ సుద్ధియనగ।
సంఘ సంస్కర్తలు ♦ సంస్కారం కథయన
సత్యాగ్రహులు వారి ♦ సాధననగ।
విప్లవ ప్రియులెల్ల ♦ విప్లవాదర్శనా
నార్థికుల్ తమ నూత్న ♦ యాగమ్మనన।

హరిజనోద్ధారవాదు ♦ ఉరుతర నిధియైన
హిందు ముస్లిము లైక్య ♦ సింధువనగ ।
ఆ॥ వె॥ హింది ని దుతెల్ల రెందు నారయనట్టి ॥
కలిత స్వచ్ఛభావ ♦ కల్పకమన ।
మాతృదేశభక్తి ♦ మాణిక్య రుచిరమా ।
దాని గాంధి భావ ♦ తంబు వినుడి॥

సీ॥ దేశభక్తులు దివ్య ♦ తేజంబు గనెదరు
హింసాపకారల్ గంద్రి హృదిని మార్పు ।
సకలమతస్థులు ♦ సమానము సంకూర
సౌభ్రాతృతను లోక ♦ శాంతి గలుగు ।
ప్రేమ సౌగంధ్యంబు ♦ పృథివిని నలమెడు
స్త్రీలు రాజ్యాంగ వి ♦ ధిజ్ఞలగుదు ।
రధికార దానత్వ ♦ బధిరత్వములు వోవు
బాధ్యతలో హక్కు ♦ పరిఢవిల్లు ।
ఆ॥ వె॥ నీతితోడ నాశ ♦ నిరతంబు వఱలును ।
మేలు మీఱునట్టి ♦ నీతిధయన ।
గాంధి భారతంబు ♦ గనుక వేడ్క జదివిన ।
ఆంధ్రపుత్రులార ♦ యరయ రండు॥

ఉ॥ ధీరులు ధీవిశాలురును ♦ దేశ పవిత్ర పవిత్రభావ వి ।
స్తార సువర్ణ నావిలసి ♦ త బసి సారెకు నెంచనవ్య వా ।
పూర సుధా ప్రపూర్ణమగు ♦ శ్లోకమధునీసమ వాహినీశుభో
దార సురూప ప్రంగన ♦ ధారలదోగి తరింపనే జనుల్॥

— అనియు చెప్పి. మనవిధి నిర్వర్తించితిమని గర్వింప వచ్చును.—

మరియొక్క సంగతి వచింపవలసి యున్నది. ఈ బాల్యపర్వ రచన నతివాత్సల్యముతో దిలగించి తప్పులదిద్ది యొప్పులను నుడికారముల నలవఱిచిన మా స్నేహితవర్యులయిన బ్రహ్మశ్రీ నాదెళ్ళ దక్షిణామూర్తి శాస్త్రిగారి కెంతయు మా వందన సహస్రంబుల నర్పించు చున్నాము.

# శ్రీగాంధీభారతము బాల్యపర్వము
## తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 4 | లవి | లలి |
| 2 | 9 | దుష్టాత్మ న్ | దుష్టాత్మునిన్ |
| 3 | 23 | వచ్చి తె | వచ్చి తే |
| 5 | 7 | విసృత | విస్తృత |
| 9 | 18 | గాలిగాన్ | గాలి‌‌ ‌‌‌‌---న్ |
| 10 | 13 | బోలె | బోలెసి |
| | 14 | పంథ | పంగ |
| 12 | చివరకందపద్యమునందు 3, 4, పాదములువదలబడినవి | | గాసవ్యమువన్యసింప న వార్యంబగుకార్యకలనపరలకయున్నన్। |
| 13 | 2 | హ | హస్త |
| 14 | 18 | న దమున | నందమున |
| 17 | 3 | వృద్ధిగా | వృద్ధి గా |
| 22 | 13 | యాంగ్లేయు | యాంగ్లేయ |
| 26 | 12 | ప ♦ ధంబుల | ప ♦ థంబుల |
| 27 | 10 | చెందురునివలె | చందురువలె |
| 28 | 15 | ద్రాపతి | ద్రాపది |
| 29 | 10 | తేజశ్శీలన్ | తేజశ్శీలన్ |
| 30 | 19 | నౌకల్ఫ్లైకళ్ళ | నౌకల్ఫ్లైకళ్ళపై |
| 31 | 7 | విద్యాబ్యాస | విద్యాభ్యాస |
| 32 | 20 | బందును నిండునుంప | బెందునునింటనుంప |
| | | తన నెం | దనయుం |
| 34 | 15 | యొప్పరింప | యేప్పరింప |
| 35 | 1 | అట్టి అం | అట్టి యాం |
| | 18 | సర్వోత్తమంబెన | సర్వోత్తమంబైన |

## తప్పొప్పుల పట్టిక.

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 37 | 6 | యాదరమున | యాదృతితో |
| | 3 | బిక్షుకై | భిక్షుకై |
| 38 | 4 | యగంగ్లులే | యాంగ్లులే |
| | 10 | స్ఫ్రిమియుం | స్ఫ్రిమియుం |
| | 22 | వర్థంతి | వర్ధంతి |
| 39 | 3 | యందులీ | యందునీ |
| | 5 | సీతథారలన్ | సీతధారలన్ |
| | 7 | యుత్సాహ | నుత్సాహ |
| | 14 | బెలుంగకయొ | జెలుంగకయొ |
| | 22 | తెర్పించ | తెర్పింప |
| 40 | 1 | పూనకతా | పూనకయ |
| | 11 | బూనియ | బూనితా |
| | 8 | జూసి | జూపి |
| | 11 | మనలు | మసలు |
| | 12 | స్థితి | స్థితి |
| | 17 | యుద్ధ | యుద్ధ |
| | 20 | తెల్లిదంబుగా | నెల్లిదంబుగా |
| | 22 | ప్రతి యు | ప్రతిష్టయు |
| 43 | 1 | కృతులనందు | కృతులయందు |
| | 21 | లవలంబె | లవంబె |
| 45 | 15 | స్నిజాతి | స్నిచాతి |
| 46 | 18 | దేశసే | నియతసే |
| 51 | 6 | చను | సను |
| 56 | 10 | అంగ్లకుమాల | యాంగ్లకు |
| | | యాయులి | మార్గయాయులి |
| 57 | 13 | నిసుబ | నిస్తుల |

తప్పొప్పుల పట్టిక

| | | | |
|---|---|---|---|
| 58 | 24 | మేము | మేమి |
| 59 | 9 | కేంద్రుటో | కెంటకో |
| 60 | 19 | నల్యాంకలనా | నల్వాంకలమీ |
| 62 | 13 | వానంబు | వాసంబు |
| 64 | 11 | యథాతంథబు | యథాతథంబు |
| 66 | 17 | ఆవిధి | ఈవిధి |
| | 22 | వాత్స ల్యము | వాత్సల్యము |



## స్వాతంత్ర్య కుసుమమాల

### చతుర్థ కుసుమము

### ఉపచార విధానము

అక్టోబరులో వెలువడును

---



పుష్పామోదావివయుతౌ
దేశకళ్యాణ కారకౌ



నౌమి సద్గుణ విభ్రాజౌ
కస్తూరీ గాంధి దంపతీ॥

# స్వాతంత్ర్య కుసుమమాల

## Editorial Board.
(Cont.)

—o o o—

5. అవటపల్లి హనుమంతరావుగారు.

6. అగ్నిహోత్రం విజయసారథి ఆచార్యగారు
ఆయుర్వేదాచార్య

## —: మహారాజ పోషకులు :—

1. కుర్తాలం పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ త్రివిక్ర
మానంద సరస్వతి స్వామివారు.

2. శ్రీ కాకర్లమూడి సుబ్బారావునాయుడుగారు M. A
A. S. Co మేనేజరు.

## — రాజపోషకులు —

శ్రీ కూనపరెడ్డి రాఘవయ్యనాయుడుగారు.
మినర్వాటాకీసు మేనేజింగు డైరెక్టరు.

# శ్రీగాంధీ భారతము

## —(బాల్య పర్వము)—



### —: ప్రస్తావన :—

కం॥ పలికెడిది గాంధి చరితము ।
పలికించెడి శక్తి సత్య ♦ భావోదయమే ।
పలికిన తృతీయ యుద్ధము ।
కలుగన్ రాదనెడి సమ్మ ♦ తమ్ముజనించెన్॥

కం॥ సృష్టిని నాశనశక్తులు ।
స్పష్టంబంబుధి తరంగ । సంచయనిభమై ।
శ్లిష్టంబగు ధర్మలతను ।
నష్టం బానగూర్పవెలయు । నాఁటికి డింతున్॥

కం॥ మృదులతను గాచు కొఱకై ।
సదమల విశ్వాసయుక్త ♦ సత్యాహింసల్ ।
కదవె తరంగము లాపఁగ ।
నదనెఱుఁగుచుఁ గట్టు కట్ట ♦ లనఁగను వానిన్॥

కం॥ కట్టెడి కాలములందున ।
గట్టిగనావాఁడియు గాంధి ♦ ఘనతరసూక్తుల్ ।
కట్టను రమ్యపుఁ బచ్చిక ।
పట్టులో చిఱులతలో యెగుచుఁ ♦ బరఁగినఁ జాలున్॥

కం॥ పచ్చిక పట్టులు బలమై ।
హెచ్చు ప్రవాహంపు నీటి ♦ హీనపు బలిమిన్॥
దచ్చఁగ నొడ్డులు కరఁగక ।
విచ్చక నిలువంగఁ జేసి ♦ వెలిఁగిన ముదమా॥

# కథా ప్రారంభము — ఛౌపరి ప్రశ్న

మ॥ కలడే యీకలియందు ధర్మమునకే ♦ కష్టమ్ముదానోర్చి శ్రీ।
లలనాపాంగ కటాక్షచంద్రికల ని ♦ ర్లక్ష్యంబుగా ద్రోచి ని।
స్తుల నిర్లిప్త విరాగ పద్ధతులలో ♦ దుర్మార్గ సంఘంబులన్ ।
లవి సన్మార్గముజూపి వృద్ధిగనగా ♦ లాలించువాఁడెవ్వఁడేన్॥

శా॥ ఏదో పావనకార్య నిర్వహణకై ♦ యీభూమిపైఁ బుట్టి యా।
ప్రాదుర్భావ విశేష దివ్య మహిమన్ ♦ రాజిల్లు సచ్ఛక్తులన్ ।
సాదన్నేర్చుచు దుష్టమారణము ని ♦ చ్చల్ సేయునేకాని, యే ।
జోదైనం దనశత్రుగోత్రమడఁగన్ ♦ శోధించి మళ్ళించెనే॥

శా॥ ఐశ్వర్యంబు దయామయత్వమునసే యాఁగాన దుష్టాత్ముఁన్ ।
శశ్వన్నాశ మొనర్చులే యతనికిఁ ♦ సంకల్పమెట్లాఁ గృపన్ ।
విశ్వాసాస్పదరుంబొనర్చి మహిమన్ ♦ బ్రేమఁ దగన్ జూపి యీ।
విశ్వంబున్నతిఁ బ్రోచి విశ్వపతిగా ♦ వెల్గొందుటల్ చెల్లదే॥

ఉ॥ రాజులు క్రూరహింసల ధ♦రంజరియించుచు నుండ్రు వారి ని ।
స్తేజులఁ జేయగా నదియె ♦ తీరున దుష్టపథానుగాములై।
రాజిలువారలే వలయు ♦ రమ్య సుధర్మపథమ్ము వీడుచో ।
సాజముగా బలోద్ధతుల ♦ సాహసమేకద వారినొంచెడున్॥

ఉ॥ పుట్టినదాదిగా జగతి ♦ బూజిత సత్య ప్రసక్త చిత్తుడై।
కట్టడి సత్యశక్తులను ♦ గాఢతదీయ తితిక్ష గూర్చుచున్ ।
గట్టిగ లోక సంపదల ♦ కాంక్ష నొకించుకపోక యన్నిటిఁ ।
మెట్టియు సత్య ధర్మముల ♦ మిక్కిలి కూర్చిన నేతయుండునే॥

చ॥ నిరతమిటుండ గాతలెను ♦ నిర్మల కర్మ పరత్వ దక్షతల్ ।
పరమ పవిత్ర జీవన ప్ర ♦ భామహిమంబు లిటొప్పగావలెఁ ।

దిరముగ బ్రహ్మచర్యవ్రత ♦ దీక్ష లిటుండగ నానటించు సు ।
స్థిరతర దివ్యజీవన వి ♦ శిష్టతఁ జూపినవాడు కల్గునే॥

ఉ॥ స్త్రీయనదుర్గుణంబు లుడి ♦ సించెడు రమ్యమనోజ్ఞపేటి, పా ।
పాయత దుష్ప్రవాహముల ♦ వారితరీతి నడంగు సంద్రమో ।
హోయనిచాటు పూర్వుల కు♦యుక్తుల ద్రిద్దుచు లోకశక్తికిన్ ।
నాయకవాళి నారియని ♦ నాయకుడెవ్వడు చూపెనీతజీన్॥

ఉ॥ సత్యము సర్వసద్గుణ ప్ర ♦ శస్త ప్రభాయుత రత్నరాశిలో ।
నిత్యము నద్వితీయగతి ♦ నిర్మల శాంతి ప్రసన్నయుక్త సం ।
స్తుత్యగతిఁ వెలుంగుచు వి ♦ శుద్ధుని నా పరమేశు దివ్య సాం।
గత్యము గల్గజేయునని ♦ కాంతను జూపినవాఁడు కల్గునే॥

ఉ॥ ఎప్పుడో యర్థదేహమును ♦ నిందు నిభాస్యకొసంగి చిత్తమున్ ।
మెప్పున నామహా మహిమ ♦ మీదనెనిల్పి మనోజుగెల్చియా।
ముప్పదిమూడుకోట్ల సుర ♦ ముఖ్యులు భక్తి వినమ్రభావమిం।
పొప్పగఁ జిన్మయాత్ముడుగ♦నొప్పెడు తాండవమూర్తి గాంచిరో॥

ఉ॥ ఆవిధి సంస్కృతిన్ వెలసి ♦ యాఘనులీలను గాంతగూడి సం ।
భావితరీతి నుండియును ♦ భవ్యగతింగడు బ్రహ్మచర్యుడై ।
సేవితసత్కళా విభవ ♦ శ్రీయుతుడై యఘదూరుడై సదా ।
పావనశీలుడౌ నరుడు ♦ భాసిలు నేకలి నెచ్చటేనియున్॥

ఉ॥ దుష్టులగూడి వారిగుణ ♦ దోషములెల్లను దిద్ది సత్య ని ।
దుష్ట ప్రవర్తనంబిటుల ♦ దోపగనౌనని చూపి, ఘోర పా।
పిష్ఠుల క్రౌర్య ధుర్యపువి ♦ వేక విహీనత నాప గట్టిగా ।
శ్రేష్ఠతదీయ జీవితము ♦ చేతుల బెట్టినవాడు కల్గునే॥

మ॥ అతివా వచ్చితె నీదురాకకును నే ♦ నాషాఢ మేఘాళికై ।
యతిలోభార్తి నిగుండు చాతకమునా♦నాశన్ గవా యుంటి నం।

చలివా ల్లభ్యము చూపుభర్త యనగా♦నామృత్యువుం గాంచునా।
తత వేదాంత పథానువర్తిగలడే♦ ధాత్రిన్ ఘనుండొక్కడేన్॥

చ॥ విధులను జేయుచే మనుజు ♦ విస్మృతధర్మము తత్ఫలంబులన్ ।
బుధులు మనంబునం దెపుడు♦పోలకుచింతమొనర్ప ద్వంద్వముల్।
మధురత నొక్కరీతిని స ♦ మంబుగ భోగ్యములంచుఁ జాటి స।
ద్బుధ నికరంబు మెప్పగను పుణ్యచరిత్రుడు కల్గునే భువిన్॥

చ॥ శ్రుతిహిత సర్వకామముల ♦ చొప్పుల బోవుచు నందువశ్యడై।
వెతలను బొంద కేకమల ♦ పీఠిని బొల్చెడు నీటి బొట్టు నా ।
ధృతి సుఖదుఃఖము ల్గలుగు ♦ తీరుల నొక్క విధిన్ జరించునా।
యతమతి నిత్యతోషితుడ ♦ హా! స్థిత ప్రజ్ఞుడు గల్గునే భువిన్॥

శా॥ శాస్త్రజ్ఞానప్రభావిశేష మహిమల్♦సామ్రాజ్యముల్ పెంపగా।
శస్త్రానీకవివృద్ధలోభ మదమా ♦ త్సర్యాత్మలౌవారి న్య
స్తాస్త్రిల్గాగ నొనర్చి ప్రేమగుణ ప్రా♦శస్త్యంబు చాటించియా।
యస్త్రాగాధ విమూఢతన్నడచె స♦ద్యోయత్నప్రావీణ్యమున్ ।

ఉ॥ జ్ఞానము శాస్త్ర పాండితియు ♦ నాదగు సోదర దేశ వాసన ।
న్మానిత సాధదివ్య ధన ♦ నాశముకై వినియుక్తమైన, న ॥
వ్వానిని ముట్టి నేననుచు ♦ భాసురయంత్ర విహీనసర్వ క ।
ళ్యాణదమైన పేదఱిక ♦ మందిన ధీరుడు నున్న యీతఁడిన్॥

చ॥ అని యడిగెన్ మహాశయవి♦హాయసభాను సమానమూర్తి పా।
వనశుభగాత్రమ దర్శిత ♦ ప్రభావ ప్రదీపిత నిత్యజీవినా ।
ననమున త్యాగతేజము ద ♦ యామయ నైజము రెట్టిసే యన।
త్యనుపమ దేశభక్తి తో ణు♦కాడు వినూతన నూతనామునిన్ ।

ఉ॥ పావన జీవయాత్ర నిర ♦ పాయత రాటము ద్రిప్పి ధర్మ సం।
భావితరీతి ఖద్దరు నె ♦ పాయక నేసియు క్షుద్రవాంఛలన్ ।

భావమునందవడంగు శోభ ♦ భంగుల బొల్చుచు లచ్చియుక్కడా ।
సేవవిమున్నతైన గుణ ♦ శ్రేష్ఠము భాసురినాము పాకతో ॥

మ. చలువల కిక్కయై వెలయు ♦ చల్లని మెల్లని పిల్లవాయువుల్ ।
జలభరవర్షా సరోవరము ♦ ఛాయల శోభిలు దివ్యపుష్పవే ।
శల రజముంగనన్ వలిలి ♦ చారుతరంబుగ జేసెనూత్న ని ।
ర్మల శుభకీర్తి వాసనల ♦ గాత్రితపుకీర్తి దలంప జేయుచున్ ॥

ఉ॥ వీచెను వారిపై జదల ♦ విస్తృతకాంతి విరాజమానుడై ।
తోచెను రాగయుక్తుడయి ♦ తోయజ బాంధవుడల్లనల్లనన్ ।
ప్రాచి మహీంధ్ర గహ్వర ♦ భాసుర శృంగపథంబుదాటి, స ।
త్కాంచన కాంతి వెల్లువలు ♦ ధారుణి నల్గడలందు నింపగాన్॥

చ॥ కలదు కలండటంచు మది ♦ గౌరవభావ పరిపూర్ణరాగ సం ।
చలనను తత్క్షణం బొదవె ♦ సద్గుణశీలు వినూత్నసూతు స ।
ద్గళము న, సత్యమే యనెడు ♦ దారివినూచె సమీర ప్రీతితో ।
జ్వల శుభపుష్ప సంభరిత ♦ వల్లులు నాయెడ నాదలల్లడిన్ ।

సీ॥ కట్టుఖద్దరుకన్న ♦ కాంతిశోభిలుచున్న
తరుణమహా ఛాయల ♦ దనువు నెలయ ।
తనువు సౌరునుమించి ♦ తళుకులగను లొచు
నేత్రద్వయంబు డప్పు ♦ నెగడుచుండ ।
నయనకాంతులనవ్వు ♦ నవ్యశాంతస్ఫూర్తి
నిలయమై వదనంబు ♦ చెలువమొప్ప ।
వదనశాంతత మించి ♦ వరలునాశయదీప్తి
సర్వదేహంబును జక్కదీర్ప ।

తే॥ గీ॥ రూఢి హైందవ త్యాగస్వ ♦ రూపమనగ ।
నడరు నభినవసూతు వి ♦ ఖ్యాతమూర్తి ।

త్రిప్పుతన్నికి విభ్రమణంబు ♦ తీరుగనుచు ।
కలడు కలడంచు బల్కెను ♦ గంతమెత్తి ।

## అభినవ సూతుని పూర్వ చరిత్ర

ఉ॥ ఆదరభావ విస్ఫురణ ♦ నంచిత ధీనిశిత ప్రసక్తితో ।
నాదిని నాంగ్లభాషను మ ♦ హాస్థను నభ్యసనం బొనర్చి, జ్ఞా ।
నోదయమంది, కీర్తిలత ♦ నుత్తమరీతిని నగ్రలంకులన్ ।
బోదిని వ్యాప్తిజెంది ధన ♦ పుష్పములన్దగ నిచ్చుచుండగన్॥

చ॥ నిఖిల సభాస్థలంబుల, న ♦ నిందిత ధర్మప్రతిష్ఠితంబులై ।
యఘ విముఖంబులై వఱలు ♦ న్యాయమహోన్నతమందిరంబులం ।
డఖిల మనీషులందున మ ♦ హాధికుడన్న ప్రతీతి యొప్పగా ।
సుఖమయ జీవితంబును ♦ విశుద్ధ విధానమునందు నేర్పడన్॥

కం॥ కారులు వరసౌధంబులు ।
నారామంబులును వఱలె శ్యామల సస్యో ।
దార గ్రామంబులును న ।
నారత లక్ష్మీనివాస ♦ నర్తన సీమల్॥

ఉ॥ క్రొవ్వున దన్నుపీడెనను ♦ కోపభరంబది యాత్మనేడనో ।
దవ్వుల దాగియున్న మద ♦ దాహ సముజ్జ్వల కీలలోయనన్ ।
రివ్వున బుద్ధి భస్మ మొన ♦ రింపగ సుందరి జంపి యెవ్వడో ।
జవ్వనపు న్మదంబునను ♦ జయ్యనజేసియు దాను వచ్చితోఁ॥

కం॥ ఇచ్చెదను లక్షరూకలు ।
హెచ్చగు మణిరాశితో న ♦ హీనప్రేమన్ ।

సత్యముగ దానిపైగా ।
నిచ్చెదనను గాంధి వలయు ♦ నీవ లెనసుప్రుల్॥

ఉ॥ రక్షణ జేయుడీనను ని ♦ రంతరమున్ ఋణబంధవర్తినై ।
యక్షయ సంపదల్తగ బ ♦ దాంబుజ సీమల నింతునెప్పుడున్
శిక్షను బాపుడన్న నృప ♦ శేఖరు పట్టయిన్యాయమందిరా।
ధ్యక్షుని న్యాయవాదపద ♦ దర్ప మహోన్నతిమించి గెల్చినన్॥

క॥ నిండెను సువర్ణభాజన ।
తండంబుల సౌధసీమ ♦ ధనరాసులనే ।
పండించిరి క్షేత్రములను ।
దండిగ రత్నాల నగలె ♦ తాల్చిరి తరుణుల్॥

ఉ॥ హెచ్చగు నార్జనల్లలుగు ♦ నీయభియోగము లెల్లబట్టుచున్।
లచ్చలు వేలు రౌప్యముల ♦ లాలన నార్జనమించి యొప్పగా ।
నిచ్చలు ద్రవ్యతృష్ణయును♦నిశ్చల వృద్ధినిబొందె ద్రవ్యముణ్ ।
హెచ్చెనువానిమించెధన♦తృష్ణయు, దృష్ణనుమించె ద్రవ్యమున్॥

తే॥ గీ॥ ఇటుల వాణీవిలాస లో ♦ లేక్షణముల ।
నిత్యమార్జింప మితిలేని ♦ నిధులు వెలసె ।
పలుకు పలికిన బంగారు ♦ వాన గురిసె ।
యుక్తి జెప్పిన వజ్రాల ♦ యూటలూరె॥

మ॥ ఒకనాడా మహితుండు క్లబ్బునను స్నే♦హాదిక్రభావంబులణ్ ।
సకలామాత్యులు రాష్ట్రపాలకులునుణ్♦సైన్యాధిపుల్ ధీరులుణ్ ।
ప్రకటాహ్లాద విశేషగర్భిత మహా ♦ ప్రాగల్భ్య గోష్ఠీ ప్రశం
సక హాస్యోక్తి రస ప్రసంగముల భాషాస్ఫూర్తితో జేయగణ్॥

మ॥ భళిరే!మీరలున్యాయమందిరములణ్♦బ్రఖ్యాతిన్యాయోక్తశో
భల వాచా మధురామృతాయత ప్రభా ♦ వాల్లభ్యవిభ్రాజులై

దళితారాతి సుసత్యవాద కలనో ♦ ద్యచ్ఛక్తి నుత్పాటనో ।
త్కల నమ్మించుచు ధర్మనిర్వహణముక్ ♦ గష్టంబుజేకూర్తురే।

తే॥ గీ॥ అనుచు హితకోటి బుధకోటి ♦ యమలసత్య ।
మార్గగమనానురక్త స ♦ న్మాన్యకోటి।
హాస్యరసయుక్త గోష్ఠీవ ♦ శానురక్తి ।
నమృతరసలిప్త ప్రియవచో ♦ హాతునొనర్చ॥

తే॥ గీ॥ సత్యమనగను నిర్దుష్ట ♦ సాక్ష్యయుక్త ।
వచనమునకన్న నన్యంబు ♦ వఱలు నొకొ॥
సాక్ష్యవిరహిత వాక్యంబు ♦ సత్యమనుచు ।
శాస్త్రదూరంపు రీతిని ♦ జనునెయొప్ప॥

కం॥ అనుచును మనమున కనువగు
చనువును వినయమును నొనరు ♦ జనగణ వినుతుం ।
డనయము, తన మనమున గను
ఘనచలనము నయనములను ♦ గననటు మెలగెఁ॥

సీ॥ అతిశయ ప్రాగల్భ్య ♦ గతిమీఱి బంచెముల్ ।
చఱచుచు పోకరు ♦ చక్కనాడి ।
చిన్నబ్యాటులతోడ ♦ చెన్నుమీఱగబ్రీతి ।
దంతకందుక క్రీడ♦దనరుచుండి ।
కేనన్సు నిన్నాప్లు ♦ కిలకిల నగవుల
బిలియర్డ్సు నాటలో ♦ బ్రీతినెఱపి ।
పత్రికలందలి ♦ వాదాల ఖండించి
చాతుర్యధీశక్తి ♦ చాటి వెలసి ।

తే॥ గీ॥ మిత్రసంతతి తోడను ♦ మైత్రి నెఱపి ।
హాస్యవచనాల నడలను ♦ నడరి యలసి ।

శీతపానీయముల కాఫీ ♦ ప్రీతినాని ।
ప్రొద్దుపోవంగ సౌధంబు బ్రోదిసతడు॥

చ॥ చనియనురాగ గౌరవ వ ♦ శంవద భావముతో నొనర్చె భో ।
జనమును పిండివంటలు, సు♦శాకయుతంబుగ మిత్రబాంధవుల్ ।
దనియగవారియాతురత ♦ దాగని తృప్తిని, నవ్యకాంతుల
త్యనుపమరీతి సద్గృహము ♦ నందలి శాంతికి వన్నె వెట్టగాన్॥

ఉ॥ ఆవెనుకన్మహాగుణ శు ♦ భాశ్రియుడా మఱునాటివ్యాజ్యముల్ ।
క్ష్మావినుత ప్రకాశమతి ♦ తేటయొనర్పగజాలు పద్ధతుల్ ।
భావమునందు సుస్థిరత ♦ బాగుగ యోజనచేయు, సాక్ష్యమిం।
కేవిధి న్యాయవాదముల ♦ నేర్పడబుష్టి యొనర్పజాలునో ॥

మ॥ అటులాలోచనమగ్నుడై కునుకురా ♦ నాతండు విశ్రాంతుడై
పటుసాక్ష్యుక్తవచః ప్రకార ఫణుతుల్ ♦ పల్మారుస్వప్నంబులో।
నిటువాదింపగ లాభమౌననుచు వే ♦ నిల్చున్ మహోత్కంఠతో।
నట న్యాయాధిపుమ్రోలబల్కు విధిగా♦నాలించి భాషించెదున్॥

ఉ॥ ఆకరణీన్ సుషుప్తిదగ ♦ నంతము నొందెడువేళ జాలకా ।
నీకముసుండి శీతకర ♦ నిర్మలకాంతి సుధాస్రవంతి, య ॥
స్తోకము దివ్యవేద మృదు ♦ సుందరనాద మృదంగ యుక్తమై ।
జోకను బ్రిక్క భూసుర ని ♦ శుద్ధ నివేశములందుగ్రాలగా॥

సీ॥ అంబువాచ్ఛాదితం ♦ బైన విద్యుల్లతన్
దగబోలికళదగ్గు ♦ తనువుతోడ ।
నడుకాఱువానలో ♦ నడరుకొన్నలినంబు
కరణినివాడు ము ♦ ఖంబు తోడ ।
ఆణిముత్యాలన నలరారు బిందువుల్,
కనుతామరలనుండి ♦ కారుచుండ ।

న్యాయవిద్ధంబులై ♦ యడరు ఘాతలచేత,
దనువెల్ల నరుణమై తనరుచుండ ।

తే॥ గీ॥ హృదయమూచెడి దుఃఖాబ్ధి ♦ నెసగు నలల
యందు జనియించు రోదయన ♦ నరుతనిండి
పెదవులనుజీల్చి యార్తని ♦ నదముచెలగ ।
సత్యదేవత యెదుటను ♦ జక్కనిలిచె॥

శా॥ బాలా! యేటికినన్ను నీఘణితి నీవాక్ప్రీతిమ ల్మించగన్ ।
జాలన్ హింసనొనర్చి నాతనువునన్ శాస్త్రార్థ వాదాసిచే ।
బోలనార్ని యనేక ఘాతలొనరన్ ♦ బోధిన్గడున్ ధర్మ ని ।
ర్మూలంబున్ బొనరింప బూననగునే ♦ రూఢిం దలంపందగున్॥

శా॥ సత్యోన్మూలతన్యాయ గమ్యమగునే ♦ సౌజన్యహీనాత్ములున్ ।
నిత్యానిత్య వివేక శూన్యమతులున్ ♦ నిర్ధర్మయుక్తోరు సాం ।
గత్యాశేష సువర్ణమోహిత కుమా ♦ ర్గాయాధములున్ బోలె
వత్యంతంబు కుపంథతుడవు ధనభా ♦ వాలోలతన్ మగ్గదే॥

కం॥ లెమ్మా, ధనతృష్ణను వీ
డమ్మా, పురుషార్థముల మ ♦ హాశ్రేష్ఠంబా ।
ముమ్మాటికి ధర్మమ్మే ।
సమ్మతి నిత్యమ్ము దాని సాధింపుమికన్॥

చ॥ ధనమది వానగల్గినను ♦ ధన్యుడవే యగుదయ్య, కానిచో!
వనయము సత్యధర్మయుత ♦ మా ఘనజీవిత పాత్రభవంబుతో ।
మనియెదవయ్య లక్ష్మియును ♦ మానుగనీదగు దివ్యమైన పాత్ర॥
క్షన ఋణ వాసనాఫలమ ♦ కాయనియుండగదయ్య నిత్యమున్

ఉ॥ న్యాయపు వాదమంచు, ఘన♦మామృదుసుందర వాక్యదామశో।
భాయుతమంచు సాక్ష్యశుభ ♦ భాసుర సూత్రనిబద్ధమంచు నీ ।

హేయమయంపు పాపభవ ♦ హీన మనోహరణైకశీల మా ।
యాయుత కృత్రిమంబగు భ ♦ యానక వృత్తి నడంగిపోయెదే॥

కం॥ వీడు మధర్మపు ధనమును ।
వీడుము శుభసత్య బాహ్య ♦ విసృత పథమున్ ।
గూడుము ధర్మార్థంబై ।
నేఁడేనా శిష్యకోటి నిరుపమ కీర్తిన్॥

ఉ॥ పోదిని దుష్టమానవులు ♦ వోయెడి యిప్పటి హ్రస్వదృష్టితో ।
నాదిని సాక్ష్యహీనమగు ♦ నంచిత సత్యము న్యాయ సీమలన్ ।
వాదముచే నబద్ధముగ ♦ భావమున న్గమకింప ధర్మనం ।
పాదన మెట్లుకాగలదో ♦ ప్రాజ్ఞ విశేషమతి న్దలంపుమా॥

చ॥ నిరతము సర్వకార్యముల ♦ నేర్పునజూచుచు గర్మసాక్షియై ।
పరగెడు సూర్యుడు న్శశియు ♦ భాసురకాంతి విలాసయుక్తమై
వఱలెడు తారలున్ జడల ♦ వర్తిల బుద్బుదతుల్యజీవనో ।
త్కరుడగు నల్పమానవుని ♦ దౌష్ట్యము సత్యముద్రింపజాలునే॥

వ॥ అనుచు దనదివ్య మంగళ విగ్రహంబును-

శా॥ చంచత్కాంతి వితాన సద్గుణ విరా ♦ జద్రత్న దేహంబు న ।
వ్యాంచత్పుణ్య సుపూజ్య కాంతి ఘృణిమా ♦ లాకీర్ణపర్ణంబుల।
ఙ్కించెన్ జ్ఞాన సుధాబ్ధి సంజనిత ల ♦ క్ష్మీదేవి లావణ్యమున్॥
మించంజాలిన రూపు తళ్కుమన గ్రొ♦మ్మించోయనంగానటన్

ఉ॥ అంతట మేలుకాంచి కడు ♦ నబ్బురపాటున సౌధభాగ మ ।
శ్రాంతము సత్యకాంతగన♦శాంతముతో వెదకున్ మనంబునన్।
జింతనుబొందు వాదముల ♦ జేయును ఖండన జేయువానినే ।
చింత నిమగ్నుడై మరలు ♦ చిత్తమునందల పోయునార్తితోన్॥

తే. గీ॥ తల్లి సుగుణాలవాల స ♦ త్య పత్రిచేల ।
నామ ధనతృష్ణ కెంతెంత ♦ నలిగెనొక్కొ।
దివ్య తోయజ సంకాశ దీప్తి నెసగు ।
మోము కళదక్కె నాస్వప్న ♦ మునను దోచె॥

మ॥ ఇకనే నెన్న డసత్యవాదముల జే ♦ యింప న్జయోల్లాసినై ।
నకలోర్వీతల ధర్మసంచయ విలా ♦ సంబుల్ మనోదార్ఢ్యముఁ ।
వికలీభూత మొనర్పజాలవు దయా ♦ విస్ఫూర్తి, ధర్మార్థమై ।
యకలంకోత్తమ సత్యవర్ధక విరా ♦ గాత్ముండ మాతాయికఁ॥

కం॥ అనుచును శాంతాశ్రిమనుచు ।
మునుకొని స్థాపించి ధర్మ ♦ ముఖ్యపథంబుఁ ।
జనమునకు జూపి నడచుచు ।
మనియెడి సినూత్న సూత ♦ మానితుడెలమిఁ॥

## ఆదర్శమానవ కథోపన్యాస నియమనము

ఉ॥ ఘోదరియుఁ మహా గుణ వి ♦ శాలమతింగడు భక్తియుక్తి నా।
హ్లాదముతో నిరంతరము ♦ నాశ్రమ వాసులలోన మిన్నయై ।
వాదవిశేష సంజనిత ♦ వైదుషిజ్ఞాన మరంద సంగ్రహై।
కాదరభావ విస్ఫురణ ♦ నబ్జమిళిందగతిఁ వెలింగెడుఁ॥

చ॥ కలడని విన్నయంతటనె ♦ కాంత నితాంత మనోవికాసము ।
జ్వలతరమైన జ్యోతులన ♦ భాసుర నేత్ర యుగంబు వెల్గగా।
బలువరుసల్ మదిఁ వెలయు ♦ భారతి దివ్యనిశాంత ప్రాంగణ ।
స్థలధర మల్లికా ముకుళ ♦ సంచయమోయను భ్రాంతిదోపగాన్॥

కం॥ ఆర్యా, సద్గుణ ములకా ।
చార్యుండగు వానిచరిత ♦ సరసులు మెచ్చన్ ।

చ॥ అని వినయంబునన్ బలికి ♦ నొదల నెత్తుచు రాటముంచెఁ జా
లనమును నాపియున్ దన దు ♦ లాలిత దక్షిణహస్తకమ్ము।
దనుపుగడించి యెత్తుటల ♦ నందఱు గాంచి యొకళ్ళొకళ్ళపై ।
నునుహాసితంపు జంద్రికల ♦ నూల్కొనువారలగూడి వేడ్కలై॥

వ॥ గౌరవభావ వశేతస్మేరంబు నడచి యభినవ సూతమహర్షితో నిటు వచించెను.-

ఉ॥ ఈదినమందు యోగులను ♦ నెల్లను నుత్తము దన్న పేరుతో ।
నాదిని భారతావని మహత్తర సుస్థిరకీర్తి గన్న యా ।
యాదవవంశధాముని కృ ♦ పాంబుధి సోముని జన్మ వాటచే ।
సాదరసూత్రయజ్ఞమును ♦ సల్పగ నాజ్ఞగదా గురూత్తమా॥ ।

కం॥ యజ్ఞానంతర మటనే ।
విజ్ఞానకుటీరమందు ♦ విశ్రుతముగనా ।
యజ్ఞానమడగ లలిసూ
త్రిజ్ఞుని చరితంబు బల్క ♦ దగదే దయతోన్॥

వ॥ అనిన నగుచు

చ॥ సరియనిపల్కె సద్గుణవి ♦ శాలుఁడు నూతన సూతమౌనివి ।
స్ఫురదరవింద కోమల వ ♦ చోమహనీయ ప్రసంగ వశ్యతన్ ।
వఱలగ గల్గుగాయని య ♦ పార ముదంబును జెందిరందఱున్
దరలిరి సూత్రయజ్ఞ శుభ ♦ ధర్మ సుపూజిత దివ్యవాటికిఁ॥

## సూత్రయజ్ఞము

మ॥ చనియావాటిక యందు నాశ్రమములో ♦ సంభావ్యచారిత్రులౌ।
జనముల్ రాటముత్రిప్పబిల్లలుమహో ♦ త్సాహంబునన్ గీతముల్।

వినిపింపన్ ఘనదేశ భక్తియుత స ♦ ద్వీర పరితాపంబులన్ ।
గనులన్ గట్టగజేయ మానసములున్ ♦ గ్రాలెన్ ఘనోద్వేగముల్ ॥

తే॥ గీ॥ అటుల గడియలు జాములు ♦ నరయరాక ।
కాలవాహిని లీనంబు ♦ గాగదాని ।
గానరెవ్వరు తీవ్రవి ♦ మానధాటి ।
గనగజాలరిలోనున్న ♦ మనుజులనగ॥

ఉ॥ అంతట సూత్రియజ్ఞమది ♦ యామెనటంచును గంటమ్రోగెన।
త్యంతముదంబునన్ బ్రజమ♦హామహునూతనసూతు సూక్తులన్ ।
వంతలడంగగా వినగ ♦ వచ్చును పోగులలెక్కలిల్పి మా ।
రంతదయామతిన్ జిలప ♦ లన్నిటినిచ్చి ప్రశాంతినుండరే॥

తే॥ గీ॥ అనెడి చోదరి వచనము ♦ లధికప్రీతి ।
పాలనముచేసి జనముల ♦ పారభక్తి ।
ధన్యసూతుని వాక్యామృ ♦ తమ్ము గ్రోల।
గూరుచుండిరి బారుల ♦ గూడియపుడు।

కం॥ వందే మాతరమనియెడి ।
సందడి తనరాక నెలమి ♦ జాటగ వార్వా ।
రందంద నిలచి కరముల ।
మందాన:దమున నెత్త ♦ మానితభక్తిన్॥

## అభినవ సూతమౌని యుపన్యాసారంభము.

ఉ॥ వచ్చె సభాస్థలంబునకు ♦ వారికధర్మ పథానువర్తియై ।
యచ్చపు భక్తి వాక్క్రియల♦నన్నిటినొక్క సుశిక్షనుంచియా ।
వచ్చరితంబు దేశహిత ♦ వర్తన వర్ధిలలోకశాంతికై ।
యిచ్చసమస్తమీయనగు ♦నీడ్యుడుపూజ్యుడుసూతమౌనియున్॥

తే॥ గీ॥ వచ్చి సభనున్న వారికి ♦ వందనంబు ।
లిచ్చి యీరోజు మీయాజ్ఞ ♦ నెటులదీర్ప ।
గలనో యనుభీతి మనమున ♦ గలదు మిగుల ।
వత్సలతజూప దరుణంబు ♦ వచ్చెమీకు॥

తే॥ గీ॥ అమల సురలోక విఖ్యాత ♦ మైన ఫలము ।
మనుజవిజ్ఞాన మనెడి వృం ♦ జనముసేర్ప ।
నూతనాదర్శలోలుప ♦ స్నాతకులకు ।
మీకొసంగెద రుచిజూచి ♦ మెచ్చుకొఱకు॥

వ॥ ఛాదరీ సోదరముఖ నిర్గతంబైన మీయాజ్ఞను శిరమునడాల్చి దేశమాతృ ప్రార్థనంబుతో సభ ప్రారంభించు చున్నాను.

సీ॥ అత్యున్నతంబౌచు ♦ నలరు నాగరికతా
గమ్యమై యొప్పారు ♦ గగనతలము ।
వివిధ వేదాంతార్థ ♦ విభవ వైశిష్ట్యంబు
నొప్పింపగాజాలు ♦ నొఱపుకాఁయి ।
భవ్యకావ్యపురాణ ♦ భాసుర పీయూష
మలరెడు నమృతంపు ♦ టాశయంబు ।

తే॥ గీ॥ శ్రేష్ఠవాగ్ధిర-కవిరాజ ♦ సింహాసహిత ।
శారదాదేవి వాహ్యాళి ♦ జనెడుపట్టు ।
హిందు ముస్లిముజనముల♦ హీనభక్తి ।
మాదిమాదను భారత ♦ మాత గొల్తు ।

తే॥ గీ॥ నవనవోన్మేషతాఢ్య స♦ నాతనాఖ్య ।
ధర్మమూలము గుర్తించు ♦ తానుగాంధి ।
స్కంధమైనిల్వ వాడని ♦ కరుణమీఱు ।
దామముల విచ్చు పారిజా ♦ తంబు గొల్తు॥

# సౌరాష్ట్ర స్వదేశ సంస్థాన వర్ణన

కం॥ శ్రీరమణి యడుగుజాడల ।
శారద కోడంట్రిమంది ♦ సాకగ మిగులన్ ।
సౌరాష్ట్రసీమ వెలసెను ।
భారతదేశమున ధర్మ ♦ భాండారమనన్॥

ఉ॥ దేశమునందు నెందధిక ♦ తేజ మెసంగెడు జీవనంబుగం ।
దాశజనింపబోవగిన ♦ రాధిపులెల్లర బెద్దజేసి యా ।
వేశము నించి పెద్దలను ♦ వీరల బోరగజేయు నాంగఁగో ।
ద్దేశము పండు పంటల పరి ♦ దేశములే గుజరాతు రాజ్యముల్॥

సీ॥ పేదవారికిబైస ♦ ప్రియమున నొసగరు
గౌర్నర్ల ఘంటల ♦ ఘనత తమది ।
దేశపరిశ్రమల్ దిద్దంగ నొల్లరు
పరదేశ వస్తువుల్ వాయువారు ।
జన్మమెత్తినభూమి♦స్వాతంత్ర్య మెఱుగరు
పారతంత్ర్యంబును ♦ బాపనెంత్రు ।
తమదేశ సుందర ♦ తరుణుల గనబోరు
తెల్లమొగాలకై ♦ దేవిరింతు ।

తే॥ గీ॥ రకట మనతల్లి సుగుణాల ♦ నలరు వల్లి
చల్లనగు గర్భసూక్తి నీ ♦ గుల్లలెటుల ।
జన్మమందెనో మొనలేని ♦ జాగిలంబు
వంశమున వీధికుక్కలు ♦ వజలి నటుల॥

శా॥ పోలోయంచును రంగణా తతులకై ♦ బోర్లించుద్రవ్యంబులున్ ।
లోలత్వంబున గామినీజన కృపా ♦ లో భాప్తికా లంచముల్ ।

హేలాపాన విజృంభణంబు లెసగెన్ ♦ హిస్టారికల్ డాన్సులున్।
వాలాయంబుగ సాగగా వెలసెబో ♦ వాంఛల్దగ న్వారికిన్॥

ఉ॥ వారలగొప్పవాడుతగు ♦ వారలలోపలవిద్దైవృద్ధిగా।
నోరిమినేర్చి వర్ధిలు గు♦ణోత్తముడాపతి పోరుబందరన్।
పేరుప్రతిష్ఠయున్ వెలయ ♦ బెంపునుసొంపుదలిర్పఁదారలన్
నీరజవైరిపోలె తగు♦నిర్మల కీర్తివిభాసమేతుడై

క॥ అతనికి నమాత్యుడయ్యెను।
వితరణశీలుండు జ్ఞాన ♦ విద్యాదక్షుం।
డతులుండుత్తమ చందను।
మతిమంతుడు ధీరుడొకడు ♦ మాన్యవిభూతిన్॥

క॥ ఉత్తమునిపుత్రుడనగా।
నుత్తమశీలంబు విద్య ♦ యున్నతగుణముల్।
విత్తములై విలసిల్లుసు।
హృత్తోషితకరము చంద ♦ నేకులు వొగడన్॥

తే॥ గీ॥ అరయదుర్గంధయుక్తమా ♦ నెరువునుండి।
హృదయరంజకపుష్పముల్ ♦ హెచ్చువచ్చు।
అట్లె సంసారమనునట్టి ♦ యబ్ధినుండి
మానినీమణిఘనగుణ ♦ మణులనెత్తె॥

క॥ ఆయమకు సంతు ♦ మువ్వురు।
పాయకసన్మార్గధర్మ ♦ భాసురమతులున్।
ధీయుతులు సత్యదీక్షో।
పాయవిదారితనితాంత ♦ పాపధ్వాంతుల్

తే॥ గీ॥ అందుమూడవవాడు మ ♦ హాత్ముతుల్య।
సత్త్వమహిమంబు మున్ముందు ♦ చాటజేసి।

జనులమోహంబు నన్మోంప ♦ జాలుననియొ
యేమొ మోహనదాసని ♦ యిడిరిపేరు॥

సీ॥ చిన్నకోనేటిలో ♦ జెన్ను మీఱుచుసూర్య
గిలిగంతవికసించు ♦ నలినమనగ।
భాసురోషఃకాల ♦ వాతపోతస్ఫూర్తి
గానమిచ్చెడు కల ♦ కంఠమనగ
విద్యుత్ప్రవాహాప్తి ♦ సద్యోవినూతనా
కర్షణగను నయః ♦ ఖండమనగ।
సద్గురూత్తము దివ్య ♦ సదమలకృపచేత
వెలిగెడి జ్ఞానదీ ♦ పికయనంగ।

తే॥ గీ॥ క్షణము క్షణమునకొక నవ్య ♦ గతినివృద్ధి
జెందుచుండగ గురువులే ♦ చెలిమివాని।
నవ్యసుజ్ఞానవృద్ధికి ♦ నాథులమన।
బాలకునివిజ్ఞ నవనవో ♦ద్భాసమయ్యె॥

ఉ॥ అంతటనొక్క పున్నమను ♦ యామినిచంద్రికసాంద్రమౌచు,న।
త్యంతమనోజ్ఞసైకతము ♦ లందున బళ్ళిచుసాగరాంచిత।
ప్రాంతములెల్లనిండి యను ♦ రాగపుసస్యముఁ బండజేయ, నా।
వింతనుగాంచి సాగరము ♦ ఫేనరుచిం గడు నవ్వుచుండగాఁ॥

ఉ॥ ఉత్తమచంద్రుడున్నిజను ♦ తోత్తమపౌత్రిలతోడ నెంతయుం।
జిత్తమెలర్పగానడుగు ♦ సీమల నూపురకాకలీస్వనం।
బుత్తమరాజహంస రవ ♦ ముజ్జ్వలరీతిదిరస్కరించిరా।
నత్తటిసాగరాంతికము ♦ నందట నాడుచు బాడుచుండగాఁ॥

క॥ చందురునిగాంచి జలముల।
నందపు బింబంబు జూచి ♦ యాదలముసుగుల్।

చిందరజేసెడి వాయువు
చందంబులగాంచినవ్వ ♦ సాగిరినిసుగుల్॥

క॥ వారే యిర్వురుచంద్రులు।
నీరములకు బైనవెల్గు ♦ నిర్మలుడతడే।
యారయ నావాడదిగో।
నీరంబుల వణకువాడు ♦ నీవాడన్నా॥

తే॥ గీ॥ అనగమోహనదాసుడు ♦ హాయటంచు।
విన్నవారెల్ల రాతని ♦ చిన్నపలుకు।
ముద్దుముచ్చటలనుగాంచి ♦ మోదమంద।
తల్లికౌగిటిలోదాగె ♦ తనయుడపుడు॥

తే॥ గీ॥ అమ్మ నీచీరె దోబూచు ♦ లాడుచుంటి।
నాకసంబున తెలిమబ్బు ♦ లందు జంద్రు।
డాడుచున్నాడు దోబూచి ♦ యడుగొచూడు।
మతని తల్లినిజూపవే ♦ యమ్మయిపుడు॥

తే॥ గీ॥ చంద్రునికిదల్లి లేదంచు ♦ జతురముగను।
బల్కుచుంటివి నిజమౌనె ♦ బాగుబాగు।
నిజముపగలెల్ల పాలనీ ♦ గజపుదొంగ।
క్రొలకీలీల బెరుగునె ♦ రోజురోజు॥

క॥ అమ్మా తెల్లనికోటదె।
నెమ్మదిగా నెట్లుమెఱయ ♦ నేర్చును జెపుమా।
ముమ్మాటికి జంద్రునిమ।
ధ్యమ్మునగల మంటిగలిపి ♦ యటుమార్చిరొకో॥

తే॥ గీ॥ సంద్రమందలి కెరటముల్ ♦ సరసగతిని।
ముందునకు వెన్కకూ మెల ♦ లెందుకొఱకు
నూగుచున్నవి గబగబ ♦ యొద్దుజేరి।
పక్కననునవ్వినట్టుల ♦ బగులనేల॥

తే॥ గీ॥ పరుగులెత్తుచు జివరకు ♦ బరమప్రీతి।
చేతులనుగల్పి యెగిరెడు ♦ చెలువుదోప।
అన్న నేనును నిసుకల ♦ నలసిసొలసి।
భూమి జేరెడియలలును ♦ బొలిచెగనుమ॥

మ॥ అనునాపిల్లలవాక్యసంచయమెయా ♦ హ్లాదాంబురాశీతరం।
గనితాంతాద్భుతరోమహర్షకముకా ♦ గా నావిలాసంబులఁ
మనముత్తేజముపొంది యీభువిననా ♦ మానీంద్రచంద్రాదిద।
ర్శనతుల్యంబగుస్వర్గసీమసుఖముల్ ♦ రాణన్ రుచిన్ జూచుచుఁ॥

తే॥ గీ॥ భూమిపైననుగునగున ♦ పోవుచుండి।
కలుగులోపల నాపుర్వు ♦ కన్నతల్లి।
దూరెనీయెడరాగదే ♦ తొందరగను।
ఇపుడెయలనీరుజంపు, ర ♦ క్షింపుదాని॥

సీ॥ పారరహితమహాచు ♦ భాసిల్లుజ్ఞానంబు
రూపైనసంద్రంబు ♦ రుచినిజూచి॥
క్షణమునకొక భంగి ♦ సారవృద్ధిజెలంగు,
శృంగారమైన వీ ♦ చికలగాంచి।
వీచీసముల్లాస ♦ విభ్రమోద్భవమైన
యానందఫేనముల్ ♦ హాయినరసి।
జ్ఞానగర్భానస ♦ తాకంతినిచ్చెడుశాంతి
చందమామనుగాంచి ♦ చక్కమురిసి।

తే॥ గీ॥ మనములందలి కలతల ♦ మార్గములను।
మఱచిపరమాత్మమహిమల ♦ మనగియుణగి।
లోకమెల్లనుమఱచి త ♦ దేకదృష్టి।
జెలగివారెల్ల వడి గృహ ♦ మ్ములకుమరల॥

ఉ॥ పోదమటంచు నందఱును ♦ బోరిడిగలంగెడివేళ నాత్మజున్ ।
మోదమెలర్పగా బిలిచి ♦ భూవిభు కోపవిశేష సూచనల్ ।
స్వేదవికీర్ణ సద్వదన ♦ సీమలు మానసకష్టవైఖరుల్ ।
సోదరతన్ జెలంగనట ♦ నుత్తమచందుడు వల్కెబుత్త్రితోన్॥

కం॥ ఏగుదము రాజకోటకు ।
సాగును నాపీటనాడు ♦ సంకల్పములా ।
పైగను బగదీఱిన నను ।
రాగముతో మనల ప్రభువు ♦ రమ్మన వచ్చున్॥

## రా జ కో ట వా స ము

ఉ॥ ఆమఱునాడు పౌత్త్రిలు మహోదరభక్తుల బుత్త్రిబంధులున్॥
క్షేమము మీఱగాదరలి ♦ శ్రీవిభవంబుల గోరుభూసురుల్॥
ప్రేమను నాశివంబుల న ♦ వీన విశేష సువైభవాప్తికై ।
సీమముతోనొసర్ప జనె ♦ నెమ్మిని నాతడు రాజకోటకున్॥

తే॥ గీ॥ ఏగియవ్వారి ప్రేమను ♦ నెలమి వారు ।
సుగుణ సంపత్తి శక్తిని ♦ జూఱకొనిరి
కరమచందుడు మంత్రిగా ♦ గల్పలతిక ।
పొన్నగాకున్న మామిడి ♦ గున్న నలము॥

## ఇంగ్లీషు విద్యాభ్యాసము

కం॥ ఆబాలురజదివించిరి ।
ధీబల పాండిత్యశీల ♦ తేజోవిభవ ।

ప్రాబల్యము కలుగుటకై ।
ప్రాభవమున గురుని మించు ♦ ప్రాజ్ఞుల యొద్దన్॥

సీ॥ వేదవిశ్రుత పుష్ప ♦ విలసితమార్గంబు
విడనాడిసంయుల ♦ వెడలు నేర్పు ।
విశ్వమానవప్రేమ ♦ విభవంబు గాదని
స్వార్థపరత్వంబు ♦ జనెడు తీరు ।
జీవితాదర్శంబు ♦ శ్రీ స్త్రీ పరత్వంబె
యనునూత్న పంథను ♦ నరుగ నేర్పు ।
ఇంద్రియలోలత్వ ♦ మేజీవవిన్యాస
సూత్రశ్రేష్ఠంబని ♦ సారిదిజాటు ।

తే॥ గీ॥ నవ్య పశుబల సింహాస ♦ నస్థప్రథిత ।
నవ్య నాగరికత శిరో ♦ భవ్యభూష ।
మైనయాంగ్లేయ విద్యా వి ♦ హారభూమి ।
దిరుగదొడగిరి బాలకుల్ ♦ ధీరగతిని॥

కం॥ లోయరు సెకండరీయను ।
హైయరు నాపైన మెట్రి ♦ కాపయి చదువుల్ ।
పాయని యుత్సాహంబున ।
నాయతమతి జదివె బాలు ♦ డతి-ముదమొప్పన్॥

చ॥ మిషనులటంచు మోదమున ♦ మేదిని నెల్లను గ్రీస్తుధర్మ స ।
ద్విషయ ప్రచారబాధ్యత న ♦ వీన మిషంబున నెల్లజాతులన్ ।
విషమగతిన్ గలంచి నిజ ♦ విక్రమ వైభవవృద్ధికాములౌ ।
విష పరిపూర్ణ జీవనుల ♦ వేడుకరంగములైన శాలలన్॥

సీ॥ యుగయుగంబుల ముందు ♦ నుత్క్వయే జనియింప
మొనమొన్న పొడమెనే ♦ యనుచునుంట ।
సర్వచైతన్య పోషణ వైభవస్ఫూర్తి

సృష్టి యీనరులకై ♦ చెలగుననుట ।
ఇంద్రియాతీతమై ♦ యేదియు నైదని
సర్వజ్ఞదృష్టితో ♦ జగము గనుట ।
ఈజన్మముంబట్టి యీశ్వరుండిచ్చెడు
నరకంబొ స్వర్గంబొ ♦ స్థిరతననుట ।

తే॥ గీ॥ యాదిగాగల్గునట్టి మి ♦ థ్యావివాద ।
తత్వజనితంబు లెల్లను ♦ దథ్యములని ।
జీర్ణమొనరించుకొనిరి యా ♦ చిన్నవారు ।
శర్కరాన్విత విషయుత సాదమటుల॥

## మాంస భక్షణోపాఖ్యానము

ఉ॥ స్నేహితులొక్కనాడు పర ♦ సేవ విశృంఖలవృత్తి బందియై ।
ద్రోహ నిమగ్న దుర్విధిని ♦ ద్రోవయొఱుంగక స్వేచ్ఛబాసిసం।
దేహవశాత్మయై జడత ♦ తీఱని విహ్వలతం జెలంగును।
త్సాహ విహీన జీవితను ♦ దంచిత మానస భారతాంబికన్॥

కం॥ తిరిగి స్వతంత్రత కలుగన్ ।
ధరావలయము ననుదగిన ♦ ధన్యసుకీర్తి ।
స్ఫురణోదార చరిత్రగ ।
వఱలగ జేయంగజాలు ♦ పంథనెమకుచున్॥

చ॥ బలమునగాదె కాఱడవి ♦ వర్ధిలు సింహము వన్యరాజమై ।
బల ప్రతిభా విశేషతన ♦ వార్యయశో విభవాభితాములై ।
చెలగుచు నుండరే మిగుల ♦ శ్రీసుఖ సంపదలొప్ప జీవితం ।
బుల నిట తెల్లవారలు న♦పూర్వముగా మన భారతావనిన్॥

తే॥ గీ॥ అరయ వారల బలమెల్ల ♦ నశనమునన ।
కీలకంబై చెలంగెడు ♦ నేల తడయ ।

మాంసమున వర్ధకంబగు ♦ మాంసమరయ।
గాన దిండము మాంసమే ♦ ఘనతరముగ॥

కం॥ అనుచును మాంసాహారము ।
నను దినమును దినగ ♦ నెవ్వ ♦ రరయనిదేశం ।
బును నియమింపగ నచ్చట ।
జనములు గనకుండ నామి ♦ షాశన మొనరెన్॥

ఉ॥ అంతట గొన్నినాళ్ళరుగ ♦ నందొకరాతిరి నామిషాశనా।
నంతరమందు బాశ్రితనకు ♦ నర్మిలి మాత దృఢానురాగపు ।
న్మంతనమొప్ప మోహనకు ♦ మారునిబిల్వ బుభుక్షలేదు నా ।
నెంతో విషాదమొందుచు ని♦దేమని యాతనిజేరి ప్రేముడిన్॥

కం॥ నాన్నా యిదేమి పొద్దున ।
మన్నన సిచిన్నిబొజ్జ ♦ మనములరంగా ।
వెన్నయు రొట్టెయు బెట్టితిఁ ।
జన్నే యీరీతిగన్న ♦ జననికి బలుకన్॥

కం॥ వల్లభ జయంతినేడే ।
చల్లగ నుదయించెనంట ♦ జనముల గనభ ।
క్త్యుల్లాసరీతిఁ బెంపగ ।
గల్లయొకింతయును లేదు ♦ గనుమాస్వామిన్॥

కం॥ మల్లెలు మొల్లలు జాజులు ।
కొల్లలుగాదెచ్చి కృష్ణు ♦ గుసుమాంగునిగా ।
నల్లదె తాతలొనర్చిరి ।
తల్లియశోదమ్మజాణ ♦ తనమును మించన్॥

కం॥ గాంధీ మోహనరారా ।
బంధీకృతుడైతి నీదు ♦ పలుకుల చేతన్ ।

బంధూకాధరయగునా ।
సింధుకుమారికయకన్న ♦ శాల్మినోసమోడ్॥

కం॥ అని నిన్ను బిలుచు భంగిని ।
ననిమిష లోచనములొప్ప ♦ నాత్మారాముం
డొనరెడు వినుమా, చనుమా ।
కనుమా పూజాగృహాన ♦ ఘను శ్రీకృష్ణున్॥

చ॥ ఇటువచియించు తల్లిగను ♦ లెత్తి కనుంగొనుచున్ మనంబులో
గటకటనొంది యింకెదియొ♦కాంతుమెయిన్ వచియింపబూను స
కటపడి మానునొత్తిగిలు ♦ గన్నుల భాష్పము నించుభీతి ను ।
త్కటపడు మోహనుండన్నుత ♦ కల్పనకొప్పని మానసంబునన్

తే॥ గీ॥ కడుపులోపల నరుగక ♦ చెడినపలల ।
ఖండములవన్ని జీవయు ♦ క్తంబు లగుచు ।
నెగిరినట్లైన భరియింప ♦ నెఱుగకచట ।
భళ్ళుమని వాంతిగాఁగ నం ♦ బయదిగాంచి॥

కం॥ అన్నా యిదేమి జాడ్యమ ।
దున్నది యున్నట్లునీకు ♦ నొనరె నటంచున్ ।
గ్రిన్నన తనయు శిరంబు పట్టి ।
సన్నతదన యక్కునందు ♦ సాదెను ప్రేమన్॥

సీ॥ గజరాజు మొఱవిని కాంతుమై వైకుంఠ
ధామంబు వదలు వ ♦ త్సలతసమము ।
తనలక్ష్మి యెల్లను ♦ తన హితు దారిద్ర్య
మునకిచ్చు నౌదార్య ♦ మునకు సమము ।
తనదాసురాలికై ♦ దాస్యవృత్తి జరించు
కారుణ్య సింధు సీ ♦ కరము సమము ।

తనభక్తుబాధించు ♦ దనుజు శిశువు జను
విపరీత వేషంబు ♦ విధము సమము ।

తే॥ గీ॥ నైన వేగంబు త్యాగంబు ♦ నార్త్ర జాలి
యొక్కపెట్టున హృదయాల ♦ బెక్కుగతుల ।
కర్షణంబును గావింప ♦ గలతనటను ।
వ్రాలిరా సౌధముననున్న ♦ వారలెల్ల॥

కం॥ వచ్చి యిదేమిటి వింతో ।
సచ్చరితుడు మోహనుండు ♦ సాయంత్రిమొకా ।
ముచ్చటలాడుచు నుండెను ।
మచ్చిక నశ్వినులు పెంచు ♦ మైనా యనగన్॥

ఉ॥ ఇంతటి మండువేసవిని ♦ నేర్పడ నీరద శ్రేణి వేగన ।
త్యంత విలాస విభ్రమ ప ♦ ధంబుల నభ్రమునంత నిండి కొం ।
డంతలుగాగ వృద్ధిగని ♦ యద్భుతలీల జగంబు వర్ష ప్రి ।
కాంతము జేయుపద్ధతుల ♦ గ్రాలెడు నీతని జాడ్యమెట్టిదో॥

తే॥ గీ॥ అనుచు జింతించి వారల ♦ త్యంతప్రీతి ।
వైద్యశేఖరు రావించి ♦ వ్యాధికుచిత ।
సేవగావించు యత్నాల ♦ జెలగు చున్న ।
బాలకుండును మాతతో బలికెగాధ॥

ఉ॥ మాతయు విస్మయాత్మయయి♦మానిత సత్యసుకాముబాలు సం।
జాత మరుద్ధు నీవికచ ♦ సద్గుణ సారస దివ్యవాసనా ।
యాత మరందలోలు పవి ♦ హార మిళింద సమానశీలు, నా ।
రాతిరి కృష్ణవిగ్రహా ని ♦ రంతర చింతనసక్తు జేయుచున్॥

తే॥ గీ॥ ఎన్నడీక ముందు మాంసంబు నన్న జనను ।
ప్రథిత హింసావిహీన మా ♦ ర్గంబు నందు ।

దారకుదరిద్ర్యంబు లేభుక్తి ♦ కొఱకుగూర్తు ।
నమ్మమాతరో నీకృప ♦ నిమ్మనాకు॥

చ॥ అనియెడి యొట్టువెట్టగను ♦ నాయమచేసె కుమారుఁడీరు పా ।
వనకుల దేశ గౌరవ ప్ర ♦ వర్ధన సూచక భాసమాన జీ ।
వనశుభ తత్త్వధీయుతుని ♦ వారిత దోషనికాయు బాలునిన్॥
ఘనవినయాన్వితున్ సుజన ♦ కంజలసద్వనహేళి ప్రేమ్మిడిన్॥

తే॥ గీ॥ ఈయుదంతంబు సనగను ♦ నెలమి నతడు ।
సర్వశక్తులవిద్య వి ♦ స్తరణ కొఱకు ।
పూనికఁ నుపయోగ పఱుప న ♦ పూర్వవృద్ధి ।
నొందె గ్రమగతి జ్ఞానంబు ♦ చందురునివలె॥

# బాల్యవివాహఘట్టం

ఉ॥ ఆవిధి గొంతకాలమటు ♦ లైచన నాతని తల్లి దండ్రులీ ।
జీవితధర్మ నిర్వహణ ♦ చింతనముం బొనరించువారలై ।
భావమునందు వారుతమ ♦ బాలు వివాహ విలాసమెంచి శో ।
భావహ కార్యనిర్వహణ ♦ భారవశాత్మత గల్గు భాగ్యమున్॥

ఉ॥ చిన్నతనంబునందె గద ♦ శ్రీవిభవంబులు పొల్చుచున్న సం ।
పన్న గృహస్థసంతతి శు ♦ భంబుల సంతస మీయజాలెడున్ ।
వన్నె వసంత చూత మృదు ♦ పల్లవ కోమల శోణరేఖలం ।
దున్న మనోజ్ఞ మార్దవము♦దోచును నిల్చునె యెల్లకాలమున్॥

తే॥ గీ॥ చక్కదనమును వలపును ♦ జవి నెఱుగక ।
చేయు పెండిలి పెండ్లియే ♦ చిన్నలందు ।
నాంగ్ల యువతులు వలచియు ♦ నంతకన్న ।
వలపు గలిగించి సౌఖ్యంబు బడయరొక్కొ॥

తే॥ గీ॥ వలపు వలపంచు బల్కఁగా వలయు నొక్కఁ ।
వలపు లఘుకాల వైభవ భవము కాదె ।
దేహలావణ్య సౌందర్య ♦ దీప్తి స్థిరమె ।
దీప్తి తగ్గిన ప్రేమ సందేహమె కద॥

చ॥ మునుపటి హిందుసుందరులు ♦ ముఖ్యముగా దమవారలెంతయు।
త్యనుపమ ధీవిశాలబల ♦ దర్ప సమన్వితులైన నంతగా ।
మనమలరంగ మోదమును ♦ మైత్రిని జూపిరిగాని సర్వదా ।
వనము గదర్పగర్వశిష్టమగు ♦ వన్నెల జిన్నెల దన్వినొందిరే॥

తే॥ గీ॥ చనును గృహమేధి నామక ♦ సౌధముననుఁ ।
ప్రాంగణంబున కందంబు ♦ బరగజేయు ॥
వినుత మందార లతయగాను ♦ దను విభవము ।
గుణ సుమర్యాద లద్దాని ♦ గూర్పుమణులు॥

తే॥ గీ॥ శివధనస్సును భంజింప సీతమెచ్చె ।
మత్స్య యంత్రంబు ఛేదింప ♦ మదినినొసగి ।
తన్వి ద్రౌపతి వరియించె ♦ తనకు పతిని ।
ధవుల గుణ ములకీడె సౌం ♦ దర్య ఘనత॥

తే॥ గీ॥ గాత్ర సౌందర్య వైభవ♦ఘనతజూచి ।
పరిణయంబుల నందిన ♦ పతులు సతులు ।
కాలపరిణామ జాడ్య సం ♦ ఘటనవలన ।
ప్రేమపాశంబులను ద్రెంచి ♦ వెలయుదురొకొ।

తే॥ గీ॥ వరుడు కాంతను, గాంతయు ♦ వరునిగూడి ।
సౌఖ్యవిభవంబు లందేలు ♦ సకలజనులు ।
అంతకన్నను సుందర ♦ మైనవారి ।
గాంచినంతనె మోహింప ♦ గడగుచుండ్రె?॥

ఉ॥ గాత్రి విలాసవైభవము ♦ కల్గియు సర్వవిధంబులైన తా ।
పత్రయము ల్గలంపగను ♦ బావన జీవన శాంతి సౌఖ్య మే ।
మాత్రిములేక దుర్విషయ ♦ మార్గములందున మ్రిగ్గి కుళ్ళి స ।
ర్వత్రిను జీవితంబు చెడు ♦ వారలు వేలకువేలులేరొకో॥

ఉ॥ అన్నిటికిన్ గుణాలెకద ♦ యారయనున్నతి సౌఖ్యమిచ్చు సం ।
పన్నత దెచ్చుకోపమయ♦భావములం గడు హెచ్చుజేయుతా ।
పోన్నతిబాపి శాంతి మహి ♦ మోర్జిత వైభవసత్స్రివంతి ని ।
త్యోన్నతికై ప్రివాహముగ ♦ నుండి చెలంగుచు బారజేసెడిన్॥

కం॥ కాబట్టి తల్లిదండ్రులు ।
ధీబల సద్వంశ సుగుణ ♦ తేజశ్శీలన్ ।
ప్రాబల్యానెఱిగి యొనరం ।
గాబరిణయములను జేయ ♦ గాదనదగునే॥

సీ॥ ముకు పచ్చలారక ♦ మూర్ఖత కనులకు
నచ్చువారలగాంచి ♦ మెచ్చువారు ।
కొత్రవారల గల్గు ♦ కొమ్మించు తళుకుల
పసనిత్యమని నమ్మి ♦ భ్రిమయువారు ।
వర్ణాంతరులయొక్క ♦ వైభవ వైదుష్య
మాయలందున జిక్కి ♦ మలగువారు ।
అభినవ సౌందర్య ♦ విభవంపుగాంతులు
స్థిరమంచు నెదనమ్మి ♦ తిరుగువారు ।

తే॥ గీ॥ సలుపు సౌందర్య బాంధవ్య ♦ చయము కన్న ।
మిన్నతాగాదె కులమును ♦ నున్న సిరిని ।
విద్యరూపంబు గుణముల ♦ విలువదీసి ।
తల్లిదండ్రులు గూర్చు శాం ♦ ధవము లరయ॥

## — వి వా హ ము —

ఉ॥ ఆవిధి ద్వాదశాబ్దముల ♦ యప్పుడె లీలగ నాటపాటలన్ ।
బోవగ పెండ్లిసేయగను ♦ బూనిరి కస్తురిబాయి తోడుతన్ ।
సేవయొనర్పగా మహిత ♦ జీవిత యాత్రను తోడు నీడయై ।
జీవపుటూతయై శుభ్రితిని ♦ సేవిత ధర్మపథానుగామిగాన్ ।

ఉ॥ చక్కని దుస్తులున్ వికచ ♦ సారసయుక్త సుమాలలున్ గడున్ ।
జొక్కపు టాట పాటలును ♦ సోకగు హాస్యపరిసక్త వాక్యముల్ ।
మక్కువ పెంచు లాలనలు ♦ మన్ననలున్ మురిపెంపుమాధురుల్ ।
నిక్కము స్వర్గసీమలను ♦ నిల్పెడి నిచ్చెపమెట్టులారయన్ ॥

తే॥ గీ॥ సప్తపదముల జనుటలు ♦ సప్తజిహ్వ ।
సాక్షియొనరించు బాసలు ♦ సకల జనులు
బంధు బుధకోటి యాశీః ప్ర ♦ వచనములును ।
దంపతుల జీవితాదర్శ ♦ దర్శనములె ॥

తే॥ గీ॥ చీని చీనాంబరంబులు ♦ శ్రేష్ఠకాంతి ।
వివిధసుఘనాద కలనా న ♦ వీనయంత్ర ।
ములును భూలోక జీవిత ♦ ఫలము తెలుపు ।
జూపు సంసార కష్టాల ♦ జూపవనుచు ॥

ఉ॥ భావమునం దలంప కెల ♦ ప్రాయపు దంపతులీ వివాహపుం ।
ద్రోవల బోవుచుండియును ♦ దుర్గమకంటకయుక్త మార్గమం ।
దేవగ లేక చూపులు త ♦ దేక విధాన నొకళ్ళొకళ్ళపై ।
నేవిధి నిల్పి నవ్వులనె ♦ యీజగము న్మఱపొంది యుండిరో ॥

తే॥ గీ॥ పెండ్లివలనను నాటకై ♦ పిల్లయొకతె ।
దొరకెనని సంతసించెనా ♦ చిఱుతనాడు ।

ధూపదీపాల వెలుగున ♦ నోపినన్ని।
నగలు చీరెలు గలుగగ ♦ నగియె నాపె॥

ఉ॥ అంతట గొన్నివర్షముల ♦ యంతర మందున హైస్కూలు విద్య న।
త్యంత కుశాగ్రబుద్ధి నట ♦ నభ్యసనంబు నొనర్చి మెట్రిక్యులేషన్।
జింత దొలంగి ప్యాసగుచు ♦ జేరగదాపయి సీము 'లాను వి।
శ్రాంతి విలాస వైభవ పు ♦ రస్సరమౌగతి నభ్యసింపగాన్॥

# పరదేశ విద్యాభ్యాస ప్రయాణ చింతనము

చ॥ అరుగుమటంచు వంశ విభ ♦ వాఢ్యతగోరెడు జోషిపల్కె సం।
బరమున నాదు పుత్రువలె ♦ భాసురలీలను 'బారు'లోన సుం।
దరతర యుక్తి ధీబల ని ♦ ధాన విధాన పథానుసార బం।
ధురరమణీయ వాగ్ధురల ♦ దోగగ శ్రోతలజేయు యుక్తిమైన్॥

తే॥ గీ॥ ఇప్పు డింగ్లీషు దొరలనే ♦ యొప్పుమీఱ।
గుప్పు చప్పుడు గాకుండ ♦ గూడవలెను।
వారి ఆచార గుణములే ♦ వలయు మనకు।
రావణుని రాజ్యమున నున్న ♦ రాము దారి॥

సీ॥ వేదశాస్త్రాభ్యాస ♦ వైదుష్యములు పోయి
యాంగ్లేయవిద్యలే ♦ యాయె జదువ।
కాశిలో వాసంబు కావలెనను టేగి
లండను వ్యామోహ ♦ మొండు గలిగె।
వర్ణవృత్తి విభాగ ♦ వైశిష్ట్యములు పోయి
మధుమాంస లోలత ♦ ల్మాన్యమయ్యె।
ప్రథిత యజ్ఞములందు ♦ పశుభక్షణము పోయి
సర్వ సమత్వ ప్ర ♦ చార మొదవె।

తే॥ గీ॥ దివిరి స్వాతంత్ర్య విభవంబు ♦ తీరుపోయి ।
బానిసత్వంబుపై మోజు భ్రమయు హెచ్చె ।
వజ్ర వైడూర్య మాణిక్య ♦ ప్రభలుపోయి।
గాజురాళ్ళుల తళుక్కులే ♦ ఘనతమించె।

కం॥ లోకమున గల్గు సగుణా ।
నీకం బరయంగ నిటను హిందూ ప్రజలం ।
దాకై రెమ్మై కొమ్మై ।
యేకముగా బెరిగి మ్రాకు ♦ లేమైపోయెన్॥

ఉ॥ కావున నెల్లవారలును ♦ కాలపరీవాహ బలోద్ధతంబుతో ।
తోవ లెఱింగి స్వీయజన ♦ దుర్బల దోహద కారణంబులన్ ।
భావములన్ గ్రహించి తమ ♦ పావన జీవితనౌక సుళ్ళలో ।
బోవకయుండి గమ్యముల♦బొంది సుఖంబుల గాంచుటొప్పగున్॥

కం॥ ఆపనికై మనమెల్లర ।
మోపిన మార్గాలలండ ♦ నురుతరఫణితిన్ ।
ప్రాకట వర్ధనమునకుం ।
గాపేగుచు గీర్తి ప్రతిభ ♦ గాంచుట లొప్పున్॥

ఉ॥ అందులకై కుమారకుని ♦ నాదృతిమై దెలి సీమకంపినన్ ।
సందియ మొందులేకతడు ♦ చక్కగ నెక్కుడు మంత్రిగద్దెపై ॥
నిందుననున్న లొచ్చగు న♦ శేందుల్రిలు నౌదలదాల్చు మానికం
బందును నిండు సంపతన ♦ నింపును సొంపును జూపనేర్చునే॥

కం॥ ఈకోరిక బీజము మది ।
సాకల్యము నాటిజోషి ♦ సరగున నరుగన్॥
బ్రాకట విదేశయాన ।
శ్రీకిని ననుకూలమార్గ ♦ చింతన పర్చెడై॥

సీ॥ మధుమాంస భక్షణ ♦ మార్గాన జననని
తల్లితోడనుబాస ♦ తొల్లి సేసి ।
కులము లోపలనుండి ♦ వెలివేయ గురుడంపు
శ్రీముఖంబును లెక్క ♦ సేయకుండి ।
అమిత ధనవ్యయ ♦ వ్యాసంగమునకుగా
సంసార నిధులెల్ల ♦ జక్కగూర్చి ।
విద్యా విశేషల ♦ బోధోద్యోగ భావన
మంజులేప్సిత పుష్ప ♦ మధువులాని ।

తే॥ గీ॥ బాలకుండెప్పు డెప్పుడీ ♦ భరతభూమి ।
వీడి లండనులో వ్రాల ♦ గూడుననుచు ।
మానసంబున స్వప్నాల ♦ మనుచునుండి ।
వేగ బారిష్టరై రాగ ♦ వెడలె నపుడు॥

కం॥ తన కలత్ర్యంబక రాయియు ।
ననువుగ దోడొచు ♦ రాగ ననుజన్ముండున్ ।
ఘనమగా రాగోత్సాహము ।
లోనగూరుప గాంధి పయన♦మొనరెను నౌకన్॥

చ॥ ఒరులకు నాంగ్లమందునను♦నూసులు వల్కగ జంకుచుండునా ।
కరులకు నాజ్ఞ నీయనడు ♦ గన్ భయమందును జల్లగాలికై ।
తిరుగగ నౌకపై బెదరు ♦ ధీరత బత్త్రికవార్త లేవినా।
నెఱుగక యాత్మ గుంగు నొరు ♦ లింటికి గాపుర మేగుకన్యనాన్॥

ఉ॥ ఎచ్చటికేగినన్ జనము ♦ లెల్లను దన్నె పరీక్ష సేయగా ।
నిచ్చలు గాంచుచున్నయటు ♦ నివ్వెఱజెందును ద్రోటుపాటుతో
నచ్చటివారు వారిసను ♦ లందున నున్నను దెప్పరిల్లు దా
నిచ్చయు శంక మానసము నెంతయు నుయ్యెలలీల మాపగాన్

ఉ॥ తోడి ప్రయాణికుల్ తనదు ♦ ధోరణి నుండక దేహపుష్టిగా ।
పొడగ రుచ్య మాంసయుత♦భక్ష్యమునోరది యూటలూరగా ।
బోడిమి భక్షణంబొనర ♦ బొంగుచు జేయగదల్లితోడ దా ।
నాడినమాట మానసము ♦ నందుదలంచి సగర్వుడౌమదిన్॥

తే॥ గీ॥ జిహ్వాచాపల్యమాపగా జేతగాక ।
దేహవర్ధక ద్రవ్యాల ♦ దినుటటంచు ।
నాత్మవంచన గావించు ♦ నట్టివారి ।
గాంచి గర్హించు యతికుల ♦ కాంతనువలె॥

ఉ॥ ఆవిధి నాతడుండగను ♦ నాతని ప్రక్కనె యందె లోకమున్ ।
బ్రోవగ రాజ్యపాలనన ♦ మోఘ ప్రవీణత జేయ రాజ్యముల్ ।
కావను వృద్ధిజేయ గడు ♦ కల్మిపిరాజిల జేయుదంత్రముల్ ।
కైవసమైన యాంగ్లులయు ♦ గంబు చెలంగెను తీవితోడుతన్॥

ఉ॥ వారలు నాసియాజనుల ♦ వంకకు జూడను నిచ్చగింపరే ।
తీరునసైన శ్వేతజన ♦ ధీబల శౌర్య ప్రభావిశేషముల్ ।
వేఱని యెర్పరింప గడు ♦ విశ్రుత వైఖరి భాషణంబులన్ ।
దీరగు వర్తనన్ నడక ♦ దెల్లమొనర్తు రనుక్షణంబటన్॥

కం॥ బొంబాయి రేవునందం ।
దంబుగ నెక్కిచను జనుల ♦ దమ దాసులుగా ।
డంబంబునను మహానం ।
దంబున వెలయుచతుర తమ ♦ ధైర్యాలు వీరే॥

చ॥ పుడమిని నూతనంబయిన ♦ భూమియొద్వీపమొఖండమేది యో ।
యడవియొ యొద్దియైనగను ♦ లందున బడ్డ యనుక్షణంబునే ।
గడబిడలేక యయ్యెడల ♦ గార్య పరీత క్రియాళి నెంచు సం ।
దడి మొయి రాజ్యవిస్తరణ ♦ దారొనరింతురు చిత్రవైఖరిన్॥

తే॥ గీ॥ అట్టి ఆంగ్లేయ జాతిని ♦ బుట్టినట్టి
యువజనావళి తనముందు ♦ నవినయమున ।
దసరి తనతోటి యాసియా ♦ జనుల సమితి ।
పైన బఱపెదు నిరసన ♦ భావమరసి॥

ఉ॥ ఏలిటు నీచదృష్టులను ♦ నెల్లరిపై బ్రిసరింత్రు దేశముల్ ।
పాలన జేయుచున్న మహి ♦ పాలుర న్నేత్రము గర్వ భూమికా ।
లోలత నున్న రాజ్యరమ లోంగున పొంగుచునున్న లెక్కకున్।
జాలని రాజ్యముల్ మునుపు ♦ చావవె దోర్బల మత్తతన్దగన్॥

తే॥ గీ॥ త్ర్యంబకునితోడ నీరీతి ♦ నవియె గాంధి ।
నౌకయందలి నానా ప్ర ♦ ధానదేశ ।
పౌరులందున సింహాలు ♦ వనమునందు ।
వెలయు భాతిని దిరిగెడి ♦ వీరి జూపి॥

ఉ॥ ముప్పదిమూడు కోట్ల జన ♦ ముల్కడు భీతిని బొందవారలన్ ।
ద్రిప్పలఁబెట్టి హైందవుల ♦ దేశమునందు మహాప్రతిష్ఠతో ।
మెప్పున రాజ్యపాలన న ♦ మేయమహా విభవాప్తి చేయగా ।
నిప్పుడు కాంచవేయదియు ♦ నిట్టిదె గర్వపు 'గారణంబెకా।

సీ॥ రవి యస్తమింపని ♦ రాజ్యంబు నేలెడు
సర్వోత్తమంబైన శక్తి మాది ।
భాసుర లక్ష్మిని ♦ వాసంబులై యొప్పు
పట్టణంబులె యునికి ♦ పట్టుమాది ।
సకల కామ్యంబుల ♦ జక్కగా దీర్చెడి
యంత్రసృష్టిప్రయోగ ♦ యశము మాది ।
ఖండ ఖండాంతర ♦ కంఠసీమ జెలంగు
పరిపూర్ణ మధురంబు ♦ భాషమా ది।

తే॥ గీ॥ ఎవ్వరెచ్చోటనే వింత ♦ నెలమి గనిన ।
దానినప్పుడె నద్దెసల్ ♦ పూనినిలుపు ।
చాక చక్యంబు మాతోడ ♦ జన్మమందె ।
ననుచు గర్వించు వీరల ♦ నగునె పట్ట॥

ఉ॥ మొన్ననకాదె రక్కసుల ♦ బోలిన రష్యనుసైన్య సింధువున్ ।
గ్రొన్నన గస్త్యుబోలె నట ♦ గల్గెను మ్రింగగనాంగ్లవాహినుల్ ।
కన్నుల నమ్మజాల కటు ♦ గాంచిరి విస్మయమెల్ల లోకముల్ ।
వన్నెయు వాసియున్ వెలయ ♦ వర్ధిలెనాంగ్ల ప్రతిష్ఠదిక్కులన్॥

శా॥ ఎంతో కాలము కాగలేదు వినవో ♦ యీభారతక్షోణి ను ।
ద్భ్రాంతి న్బొంది సమస్త దేశ జనులున్ ♦ దర్పోద్ధతిన్ ముగ్ధులై ।
శాంతింపుండని తమ్మునాగగనుజం ♦ చఛ్చార్య విక్రాంతి న ।
త్యంతోదగ్రరణ ప్రదర్శన కళా ♦ దర్పంబులం జూపుటల్॥

ఉ॥ బాపురె యొజ్జకోటను బ్రి ♦ వాహము కట్టిన వీరరక్త మ ।
క్షేపున బూర్వపశ్చిమ జ ♦ లేశుని తోడుత నైక్యమొందుడీ ।
రేపును మాపు సూర్య శశి ♦ రేఖల టాదరినేగ నెజ్జనై ।
తోపగజేయు నిప్పటికి ♦ దుర్దశ మొప్పగ గారణంబులై॥

తే॥ గీ॥ అనెడు త్ర్యంబకుతో గాంధి ♦ యనియె మరల ।
నీకరణి వానివాక్కులు ♦ సోకినంత ।
నడగగప్పిన యజ్ఞాన ♦ మనెడి ఛదము ।
జీల్చి కన్నుల శౌర్యంబు ♦ చెలగి వెలుగ॥

చ॥ జననియుమున్నకొంచెముగ ♦ సాహసకార్య విధానఘట్టమున్ ।
మనమున కెక్కనట్లుగన ♦ మానుష పౌరుష సూచకంబులౌ ॥
కనుగవ బాష్పపూర్ణమయి ♦ కాఱునదమ్మియుగంబు బోలుచా
యనుగనుపింప జెప్పెనది ♦ యంతయు బూర్తినొనర్పుమా ధృతిన్॥

## రాజ్యారంభం

తే॥ గీ॥ అనిన నాతని తోడను ♦ దర్శింబకుండు ।
దేశభక్తి విలాస ధీ ♦ ధితుల బఱపు ।
వదన చంద్రుని నిస్పృహా వారిదంబు ।
గ్రమ్ము చుండంగ నాతని ♦ కనులు మెఱయ॥

ఉ॥ ఇక్కడలేనివస్తుతతి ♦ నెచ్చటనైననుగూర్చి తెచ్చి మీ।
యక్కఱదీర్చి దేశజుల ♦ యాదరమున ఘనవర్తకంబులన్।
నిక్కముచూఱగొందుమని ♦ నిచ్చలు బాసలొనర్చి కోటలన్।
బెక్కులుకట్టి రాజ్యమును ♦ బెల్లువినాశమొనర్చిరెంతయున్

మ॥ అకటా! వీరశివాజి! తద్ఘనుని పై ♦ న్యాధ్యత్ములున్నెరరే।
ప్రకట ప్రాభవదత్ములౌ ఘనులు పీ ♦ ష్వాలున్దగంజాలరే।
సకలైశ్వర్యకళాయుతుల్ మొగలు రా ♦ జన్యుల్ తగన్ శిక్షసే।
యక మాధుర్యవచోవిలాసముల నా ♦ హాపాయుటేరాజ్యముల్

## రాజ్యాక్రమణము

ఉ॥ ఇక్కడగొంత యక్కడ మ ♦ ఱించుక నాపయిదిక్కుకొంత న।
ల్ప్రక్కల నావరించి యొక ♦ రాజునెఱుంగకయుండనందఱన్।
జక్కగదువ్వి సింగముల ♦ చాతురిబోనులనుంచు చాడ్పునన్।
నిక్కమునిల్పి మోసమున ♦ నేర్పున రాజ్యముగెల్చి రెంతయున్

సీ॥ ప్రక్కరాజులతోడ ♦ భాషించుటకుగూడ
నింగ్లీషువారాజ్ఞ ♦ నీయవలయు
పుత్రహీనుండైన ♦ భూపతి పెంపును
నింగ్లీషువారు చే ♦ యింపవలయు।

ప్రజలవర్తకమును ♦ రక్షించుసుంకంబు
కైయాజ్ఞనాంగ్లులే ♦ వేయవలయు
విద్యాభివృద్ధికై ♦ విజ్ఞానబిక్షకై
యగంగ్లులే ధర్మ మిా ♦ యంగవలయు

తే॥ గీ॥ అట్లు దిగ్బంధనముజేసి ♦ యఖిలజనుల।
రాజులను వర్తకుల పరి ♦ శ్రమలవారి।
జలువగుడ్డలతో గొంతు ♦ జక్కనులుము।
విద్దెలను జాణలై, కడు ♦ వెలసిరంత॥

చ॥ ఒకమతమూనువారలను ♦ నూరక వేఱుమతంబువారితో।
డికలతగల్గునట్టుల దుర్ ♦ టిన్బ్రమియింపగజేపి పైనవా
రికి గడుముప్పుదెచ్చియు మ ♦ తేమియెఱుంగనిరీతిచట్టమూ।
రక యిరుపక్షముల్మిగుల ♦ రాదని శిక్షలొసంగిరక్కటా॥

తే॥ గీ॥ ఇట్టివై ఖరి సామ్రాజ్య ♦ మెలమిబెరిగె
గారడీవాడు పెంచు వృ ♦ క్షంబుకరణి।
మాయలోనుండిపుట్టు బ్ర ♦ హ్మాండమటుల।
బాపమును మోయజనులకు ♦ భారమగుడు॥

# సైన్యపరివర్తనము

చ॥ మనదగు బాహువిక్రమ ప్ర ♦ భావముచేమననేయడంచుచున్॥
ఘనముగ రాజ్యవిస్తరణ ♦ కాంక్షనొనర్చిరి యాంగ్లులీయెడన్॥
మునుకొనివీరికిన్ మనము ♦ బూన్కిసహాయమొనర్పకున్న, సూ
ర్యుని ఖరకాంతిగ్రీష్మమున ♦ రూపరుతీగన నాశమొందరే॥

శా॥ ప్లాసీయుద్ధమునందు నాంగ్లజనసం ♦ భద్దర్పదుస్తంత్రముల్॥
భాసిల్లెంగద తన్మహూర్తశతమా ♦ వర్ధంతి యీావర్షమం।

దేసారోద్ధతివచ్చునా గడియ నీ ♦ దేశంబు నల్దిక్కులన్।
గాసిం బెట్టికలంచి వారలను వే♦ గనొంచి నన్నేలియమా॥

ఉ॥ సేనలయందులీగతిని ♦ జిత్తపుబోధముగల్గి దేశపుం॥
బానిస చీకటుల్ దొలగి ♦ పాయస్వతంత్ర సుభానుకాంతుల
వ్యాని సుధైర్యసాహస శు ♦ భావహర క్తపు నీతధారలన్।
గానగనౌనొకో విమల ♦ కల్మషనాశచరిత్ర గాథలన్॥

తే॥ గీ॥ అనెడు యుత్సాహపూర్ణమ ♦ హార్ణవమున।
నిరత కేళీవిహార వి ♦ సీతులగుచు।
సర్వసైనిక నివహము ♦ పూర్వరీతి।
నుత్తర ప్రాంత సీ ♦ మనునున్ననంత॥

ఉ॥ దక్షిణదేశజుల్స్వకపు ♦ దారిని ధైర్యవిలాసయుక్తిమై॥
దక్షతతోడ జేరరని ♦ దర్పవిహీన చరిత్రులంచు మా॥
పక్షముబూన బోరనెడు ♦ భావవశంవదవృత్తి నెంచియో
శిక్షపథంబెఱుంగకయొ ♦ చేరగబిల్వరువారినాతఱిన్॥

ఉ॥ ఎప్పుడు ప్లాసియుద్ధ దిన ♦ మేర్పడవచ్చునో యేరితోడుతన్
జెప్పక శత్రుమారణ వి ♦ శిష్టవిహారము చేయగూడునో॥
మెప్పున దేశజుల్ మనల ♦ మెచ్చుచు నిందు స్వతంత్రవైభవం
బొప్పను వీరిధైర్య విభ ♦ వోజ్జ్వల పద్ధతి జూపువారలో?॥

తే॥ గీ॥ అనుచు సేనలభట కోటి ♦ యధిక శౌర్య॥
కార్యనిర్వహణంబున ♦ ఘనతజూప॥
నెపుడు నెపుడంచు గొలుసుల ♦ నేపుమీఱ॥
తెంచ నుంకించు కుర్కుర ♦ శ్రేణివోలె॥

మ॥ అదిగో ఢిల్లిని సర్వసైన్యములు స ♦ మ్యద్ధైర్య సామగ్రితో॥

మదిలో జాలియొకింత పూనకతా సమ్యగ్ద్వేషముం బూనియు॥
మెదిరించెంగదయాగ్రియామునుపెయా ♦ మెండ్రుంప శ్వేతాళిమా
మదియోజింపగ నింక నాగుటలు మా మందత్వముజ్ఞాసెదున్।

ఉ॥ కాలము తోడుపాటయిన ♦ కల్మషహీనరణ ప్రతాపముల్॥
చాలప్రదర్శనంబొనర ♦ జాతిసరిజూపిమహామహోద్ధతిన్॥
దూలగజేసి శత్రులను ♦ దోర్బలముందగ జాటి, కీర్తి యీ॥
నేలనుసిల్పువారమని ♦ నిశ్చలతన్ దగసాగె సైన్యముల్॥

సీ॥ అతిధైర్యమును జూసి ♦ యరులను జెండాడు
వారమ్యోదమటంచు ♦ బలుకువారు
అసమానశౌర్యాన ♦ కగ్రితాంబూలంబు
మాదండు దేయని ♦ మసలువారు
నుత్సాహమరిగిన ♦ నుద్యమస్థితి నాత్మ,
నిసుమంత పట్టక ♦ యెసగువారు॥
పదిమంది నరుకనా ♦ సైనొప్పు స్వాతంత్ర్య,
గతియేమొ యోజింప ♦ గానివారు॥

తే॥ గీ॥ మేము మేమంచు ముందుగా ♦ మేఱనాటి
యుద్ధసంగతి వ్యూహ ప్ర ♦ యోజనములు॥
నించుకేనియు నెఱుగక ♦ మించువారు
నియమముల మీఱ యుద్ధంబు ♦ నియతిదప్పె॥

## మీరట్ తిరుగబాటు

ఉ॥ మీరటునందు ముందు గను ♦ మీనవిలోచన తెల్లిదంబుగా॥
నారడి లేక స్నేహితుల ♦ నందఱజైలుల కంపిధీరతై॥
పేరు ప్రతియున్నిగుల ♦ చేర్మని వారి కొసంగివచ్చు నీ।
వీరుల రాకచే బ్రియము ♦ వేగమహొందెదు గాజులీపురిన్॥

తే॥ గీ॥ నియతి గోమాత కొఱివ్వన ♦ నిండినవయి।
వజలు తోటల దిశ్వాకళ ♦ దొరలకొఱకు ।
దుర్గించు వీరలు మాత నె ♦ త్రుటిని గూడ ।
ద్రవ్యమున కమ్ముచవారన్న ♦ దబ్బఱగునె॥

చ॥ అనువచనాలు తాపమిడ ♦ నన్నము నీరునుముట్ట నొల్లకే।
మనములు భీష్మగ్రీష్మ పటు ♦ భానుకరాప్తిని వాడివత్తులై ।
చనుతరులందు నింగలము ♦ చాడ్పున నొప్పగ నద్ది మంటయై ।
చననటనయ్యె నాహుతిగ ♦ జానుగ ఢిల్లియు లక్నొ సీమలున్॥

తే॥ గీ॥ ఎచట గనుగొన్న హరహర ♦ వచనమొదవె ।
వినమహాదేవ శబ్దాల ♦ వీనులదరె ।
దెల్ల పురుషుల రక్తాలు ♦ దేహమెల్ల ।
సిక్తమాయెను నెల్లడ ♦ సేనలకును॥

తే॥ గీ॥ తెల్లవారల రాజ్యంబు ♦ తేజమడగె ।
మనకు బహదూరుషాగాజు ♦ మరల నిపుడు ।
తురక హిందువుభేద మెం ♦ దు గనకింక ।
దేశరక్షణకై ప్రజల్ ♦ దివురు టొప్పు॥

## సేనలు ఢిల్లీ చేరుట

చ॥ అనుచును సేనలయ్యెడ మ ♦ హాహవదీక్షమెయిన్ జెలంగగా।
జనిరట పాదుషా భవన ♦ సన్నిధి నున్నతడంత నార్తితో ।
గనులను బాష్పధారలను ♦ గార్చుచునయ్యెడ సేనజీతమై ।
నను నొసగంగనేరనని ♦ నాయనలార! విషాదలోలుడై॥

ఉ॥ మాధ్యగు నా స్త్రిపాస్తులు స ♦ మస్తములాగగ లోనిచాఱిణమే ।
మాదిరి నో చెలంగగను ♦ మఱిందియు మఱిందనిరీతి బొందిలో।

మోద విహీనమైన శవ ♦ మోయను లీలను మమ్మెజూచు నీ।
పాదరి రాజ్యనాశమును ♦ బంధుగ గాగను కాలమబ్బెనే॥

తే॥ గీ॥ మీరు జీతంబులీయగా ♦ నేరకున్న ॥
సంశయంబేల యాంగ్లుల ♦ సరుకులుండ ।
బ్యాంకులుండంగ మాచేత ♦ బాకులుండ ।
దీవనల నిచ్చి పంపుడీ ♦ తెచ్చుకొనగ॥

చ॥ అని వచియించి సేనలు మ ♦ హాద్భుత విక్రమవైభవంబునన్
జని ఘనమా పరాక్రమ ప్ర ♦ సార విజృంభణ నెజ్జుకోటపై ।
ననువగు రీతి నందఱు జ ♦ నావళి ప్రేమను జూరగొన్న పా।
వనమగు బావుటానిలిపి ♦ వారలు మించిరి విక్రమోన్నతిన్॥

తే॥ గీ॥ ఇంతలో నీలువచ్చె నా ♦ గంతుకముగ ।
చీనదేశాన యుద్ధంబు ♦ చెలగకున్న ।
మాతృదేశంబునకు బోవు ♦ సుహిత యుద్ధ ।
నిపుణ విఖ్యాతియుక్తుండై ♦ నికులతోడ॥

చ॥ బ్రితికితినంచు భవ్య ప్రతి ♦ భామతి గొన్నరు జనలాయెడన్।
జతురత నీలు నాయకుని ♦ చండతరంబగు[illegible]
నతని నె పంపె ఢిల్లికి జ ♦ యార్థముగానత డెన్ని కూరిరముల్ ।
సతత మొనర్చినం దనను ♦ సమ్మతమేయను నొప్పుకోలుతోన్॥

ఆ॥ వె॥ ఆజ్ఞనొంది నీలు ♦ డఖిల భారతదేశ ।
మాంగ్ల చరిత నిట్టి ♦ యన్య కూరిరు ।
గానమనును జనము ♦ కడురోదనము సేయ ।
శవపరీత మార్గ ♦ చారియయ్యె॥

సీ॥ నందకుమారుని ♦ సందేహ రహితమై
వఱలిన తీర్పునం ♦ దరయబుట్టి ।

అలయయోధ్యా సతీ ♦ హాహాకృతులనందు
నను వైనపాఠంబు ♦ లరయ నేర్చి।
బలహీన రాజుల ♦ బలిమి నేలించెడి
వెల్లన్ని తంత్రాల ♦ విస్తృతిగని।
డబ్లాసిజిత్తుల ♦ డంబపు దంత్రముల్
విపరీతమగు రీతి ♦ విజ్ఞప్తిగి।

తే॥ గీ॥ ఆంగ్ల ద్వార్జన్యనామ మ ♦ హాగ్రహంబు।
పైన నాచ్ఛాదనంబును ♦ బాఱవైచి।
పురుషులంచును స్త్రీలని ♦ యరయకపుడు।
నరుకసాగెను రక్తంపు ♦ నదులు వాఱె॥

## నీలు ఘోరములు

చ॥ జనరలుగీలు కాశిని బ్రి ♦ జానివహంబును జంపె గూ్రరుడై।
వనములయందు జంతుతతి ♦ బట్టుచు వేట యొనర్చు కైవడిన్।
జన శిశు బాలభామినుల ♦ సాంద్రభయానక రోదన ధ్వనుల్।
విని విపరీత మోదమును ♦ వేమఱు రాక్షసు లీల బొందుచున్॥

మ॥ అలహాబాదున దేశవాసులను నా ♦ హా యెంతకష్టాత్రతాలర్పుడో
చలమొప్పంగను గాలుసేతులను గా ♦ ష్ఠాలట్ల ఛేదించి వా।
రల దోడ్తో ఘనమా శతఘ్నులకు జే ♦ రంగట్టి భిన్నాలుగా।
లలిగావించుచు నార్చి తేలెనటలీ ♦ లనాత్రుసుల్మెచ్చగన్॥

ఉ॥ మానవులంచు వారు తమ ♦ మాసిత దేశవిముక్తి రక్తిమై।
బూనిరి యుద్ధమంచు దము ♦ బోలుచు వారిని జూడ దైపసు।
జ్ఞానలవలంబె తేజరిలు ♦ నవ్య విలాసము వల్లనంచు నే।
మైనను నెంచెనే పశువు ♦ లైనను మేలగు గాదె వానికిన్॥

ఉ॥ ఆయుధమిచ్చి యాపయిన ♦ నారయ ధైర్య పరాక్రమాప్తి దా।
నేయెడ నేవిధిన్ దమకు నీప్సితమో యటులాస్థలిన్ సదా।
న్యాయగతిన్ రణంబున జ ♦ యంబును గాంచగలట్టి వారిన
న్యాయముగాగ నీవిధిని ♦ నారడి వెట్టితివేమి రాక్షసా॥

ఉ॥ చేతులు వెన్కకున్వెఱిచి ♦ చెట్టులకు న్దగ గట్టి విన్కు నీ।
మాతృ సతీ సుతావళిని ♦ మాన విహీనులజేసి వేశ్యమై।
బూతులదిట్టి ముక్కలుగ ♦ భూమి బలిన్బ్రసరింప నుందు నా
రీతి దలంచి నీచెడుగు ♦ లీలల నాత్మను జింతసేయుమా॥

ఉ॥ ఎందఱు తల్లులందెడ ద ♦ నింపులు గుల్కెడు పచ్చిగుడ్లతో।
సుందర సుస్మితాననలు ♦ శూరుల బోలెను నీ తుపాకులన్।
మ్రిందగ జేసితో తెలియ ♦ రాదాకొ నీదగు నాజ్ఞ జేసి యే।
మందువు గ్రామ గ్రామముల ♦ నగ్ని వినాశ మొనర్చెనీ మొనల్॥

ఉ॥ సాయుధులైన సేనల న ♦ సంశయవృత్తిని నాయుధమ్ములన్।
జేయను బూనవాడగల ♦ చెల్వులెఱుంగక శాంతజీవులై।
మాయ లెఱుంగనట్టి గుణ ♦ మాన్యులపైన శతఘ్నివర్షము।
న్యాయము జేసి బాపుటను ♦ నల్పు నొనర్చితివేమిరాక్షసా॥

సీ॥ ఈయుగంబందున ♦ నెల్ల దేశజులకు
స్వాతంత్ర్య భావంబు ♦ జాటిమఱియు।
ప్రజల హక్కులకునై ♦ ప్రథమ యుద్ధంబును
గావించు హాంప్డెను ♦ గాంచిమఱియు।
అంకుశ హీనులౌ ♦ నధిపుల నడచిన
క్రాంవెలు మాలోను ♦ కల్గిమఱియు।
సర్వదేశములందు ♦ సాహసంబును జూపి
చిన్నవారల యండ ♦ జేరి మఱియు।

తే॥ గీ॥ లోకమందున న్యాయము లుప్తమైన ।
యన్నియెడలను ధర్మంబు ♦ గన్నవార ।
మనుచు బల్కెడి యాంగ్లేయ ♦ ఘనతజాతి ।
తలలు వంచెను నీవల్ల ♦ ధర్మహీన॥

శా॥ తల్లీ యాంగ్ల వధూమణీ విమలసాం ♦ ద్రంబైన నీకీర్తి స ।
ద్వల్లిం దెంచి యనర్ఘ్య ద్రోహఘయు ♦ క్తంబైనబీజంబులన్ ।
జల్లం జూచెదు నీలుతొదలకునో ♦ జన్ ట్రాల్లియన్ వారిసీ ।
వెల్లీమార్చెదొ రాజ్యనాశనమునే ♦ యీక్షింప గాంక్షించెదో!

## కాన్పూరు దురంతములు

ఉ॥ నీలు విచిత్ర క్రూరవధ ♦ నిస్తుల దుష్ట చరిత్ర వీనులన్ ।
గాలగ జేయగా హృదయ ♦ గహ్వరమందు సుషుప్తినున్న యా ।
భీలపు ద్వేష రోషములు ♦ వేల్మిడి ప్రజ్వలనంబు నొంది శ్వే ।
తాలయమైన కాన్పురి వ ♦ ధల్గడు గ్రూరత గల్గ జేయగాన్॥

శా॥ ఏమీ! హైందవరక్త వార్నిధులఁ జ ♦ న్నే స్నానములేసిమా ।
గోముల్గాల్చియు నాండ్రబిడ్డలఁ గడు ♦ న్గ్రూరత్వ మేపారగా ।
నీమాలేమియులేక చంపి మిగుల ♦ న్నీజాతి నీచంబులా ।
కామోద్రిక్త విహారసక్తులగు నాం ♦ గ్లానీకము న్గాతురే॥

ఉ॥ నాతుల ముట్టబోకుడి స ♦ నాతన ధర్మ ప్రసిద్ధ పద్ధతుల్ ।
కాతరత న్వజించి కడుఁ ♦ గల్మష యుక్తపుఁ గ్రోధక్రౌర్యము ।
బ్రూతలనూప బాలశిసు ♦ యుగ్మలివర్గము జంపబోయి వి ।
ఖ్యాతినిమాప జూడకుడి ♦ యయ్యయొ! తాల్మివహింపుడీదయన్॥

చ॥ అనినను గంగదాటు తటి ♦ నాంగ్ల సతీ శిశు బాలబాలికా ।
జనముల హత్యజేసియు బ్ర ♦ జానివహంబులు క్రోధపూరితుల్ ।

చలమున సర్వసైన్యముల ♦ జక్కలకున్ పడిపింపనవ్వియున్ ।
గలఁగఁగ శ్వేతరక్తముల ♦ కాలువలే ప్రవహించె నల్లెడన్॥

తే॥ గీ॥ ఆలిఘరు మీానపురియును ♦ నైతరా బ ।
డేను రోహిలు ఖండంబు ♦ జానుపూరు ।
మూరదాబాదు గోరక ♦ పూరు మఱియు
నన్ని సేనల నిలయము ♦ లంపుగలిసె॥

కం॥ ఆవిధి నిఁకన్ని నెలవులఁ ।
బ్రావృట్జల ధరనికాయ ♦ భాసురగర్జా ।
రావ నిభశతఘ్నిరవము ।
లావసుధానభముగా ది ♦ గంతము నిండెన్॥

చ॥ దొరలను జంపి రక్తముల ♦ దోగిడి తిన్నని లాంఛనంబులన్ ।
వెఱపొకయింత లేకయును ♦ బెట్టుచు బీరము చాటిరందఱున్ ।
దరుణమునందు శత్రువుల ♦ దారులగట్టుచు దేశమిత్రులం ।
దఱిదము జేర్చుమార్గములు ♦ దారతనేరు దలంప రైరిగా॥

సీ॥ ఒక్కదేశమునందు ♦ నోలిమై జన్మించి
కష్టసుఖంబుల ♦ నగలిసి యుండి ।
లాభనష్టంబుల ♦ లలిమీాఱ నేకమై
వర్తక సరణి లో ♦ పలను గలిసి ।
దేశసేవను నీవ ♦ నేనాయనుచు నుండి
శత్రుమారణమందు ♦ సాగుచుండి ।
అన్యోన్య ప్రేమల ♦ కాలవాలములౌచు
వారి శత్రులె వీరి ♦ వైరులనగ ।

## శిక్కు సేనల నిరాకరణము

తే॥ గీ। ఒక్కమాతకు బుత్త్రులై ♦ నిక్కమెఱిగి ।
సిక్కుసేనలు మాతోడ ♦ జేయిగలిపి ।

శ్వేత నిగళంబులను ద్రెంప ♦ జెలగుడయ్య ।
దేశమాత ఋణంబును ♦ దీర్పుడయ్య॥

చ॥ అదె చనుదెంచె నీలు కరి ♦ నాంతర శీలుడతండు మమ్ముల ।
న్నదయత జంపు నిక్కవము♦టాపయి మిమ్ముల నొంచునమ్ముడీ।
యిదె మనమిద్దజేకమయి ♦ యిమ్మొయి నొంపగవచ్చువారి రా।
గదె యిటు సిక్కు సోదరుడ ♦ కాలమదిట్టిది రాదు పోయినన్।

ఉ॥ ఆయుధశాల మీాకరము ♦ లందున నున్నది వానినిండు మీా ।
సాయముగోరి మాత యదె ♦ సాజపు గోమల సుస్వరంబునన్।
'నాయనలార రండనుచు ♦ నర్మిలి బిల్చెడు చూడరేల రా ।
లాయవి! మీా మనంబు లర♦ యంగను లోహసమానములున్నడీ॥

తే॥ గీ॥ మనకు మనకును భేదంబు ♦ మాయగాదె ।
తెల్లవారలె దాని మీా ♦ యుల్లములను ।
నాటినారలు రారండి ♦ నేటినుండి ।
యేకవాదము శత్రుల ♦ మూకచచ్చు॥

కం॥ అనుచును సిక్కుల సేనల ।
వినయముననను బ్రేమ బలిమి ♦ వెలయగ హిందూ ।
జనులను మహమ్మదీయుల ।
మొనలును బిలువంగరారు ♦ మూర్ఖతవారల్॥

సీ॥ తనకు నష్టంబైనఁ ♦ దనశత్రునాశంబు
జేయగా నితరుల ♦ జేరు వెట్టి ।
తనలక్షలను మీరింగి ♦ తనకు దమ్మిడి నిచ్చు
మోసగానికి మ్రొక్కు ♦ మొండితనము ।
ఎదుటివాని సుఖాన ♦ కదయత దనవారి
నష్టకష్టములిచ్చు ♦ నలంతి తనము ।

ఎంతవారైన నను ♦ నిసుమంత తనవాని
శక్తి గుర్తింపని ♦ చండితనము ।

తే॥ గీ॥ భీరువులైనను బెఱవారి ♦ వేల్పులంచు ।
గొలుచు చుండెడి మెనలేని ♦ గుడ్డితనము ।
తల్లి మెనలేని సుగుణాలు ♦ దనరువల్లి ।
నీదుసుతులందు నెటుకల్గె ♦ నాదు తల్లి॥

సీ॥ అలనాడు ఘోరీని ♦ నా జయచంద్రుడు
పృథ్వీని సాధింప ♦ బెళగడేని ।
మఱిరామదేవుని ♦ మదమడంపగ నరుల్
సాహెబు సేనతో ♦ సాగరేని ।
లోడీలలో దుది ♦ వాడిబ్రహీంమట
బాబరు చేతిలో ♦ బడడ యేని ।
ఇప్పుడీ సిక్కులు ♦ నొప్పరికింపక
సోదర శ్రేణితో ♦ బోదురేని ।

తే॥ గీ॥ తల్లి భారతి నీవిట్లు ♦ దారిలేక ।
దుష్టపరతంత్ర దుర్వృత్తి ♦ దొరలు చుండె ।
తన్ను వారల పాదాల ♦ గన్నులద్దు ।
నీచబుద్ధులనగనేల ♦ నీదు సుతులు॥

ఉ॥ సిక్కులు చేరలేదు కడు ♦ శీఘ్రగతింబర తెంచె శత్రులు ।
న్నిక్కప్రదేశ లాభమది ♦ నిక్కము లుంగక దిగ్భ్రమంబునన్ ।
దక్కెను భ్రాంతమంచు బలు ♦ నాయకుల బారె జనంబు లెప్పుడేన్
జిక్కులెఱింగి దేశహిత ♦ సిద్ధికి వీరు చెలంగ నేర్తురే॥

సీ॥ పాఠియా లేశులా ♦ స్వాతంత్ర్య యుక్తులున్
బరరాజు స్నేహమున్ ♦ భ్రమను బడగ ।

సూర్యవంశపు రాజ ♦ శూరులు నేపాలు
వార మ్యోధ్య నవాబు ♦ పైననెత్త ।
గ్వాలియరిండోరు ♦ ప్రథిత బరోడాల
వారలు స్తబ్ధులై ♦ వణకుచుండ ।
జిత్తులమొకిమీడు ♦ జితవైరి నైజాము
తన బిరుదాళికై ♦ తటపటింప ।

తే॥ గీ॥ సైన్యలోకం బనాథత ♦ జాగుసేయ ।
దక్కజనములు సేనలఁ ♦ జిక్కిపోఁగ।
శత్రుకందటికిని బ్రేమ ♦ శరణొసంగ ।
భారతంత్ర్యంబె తిరమయి ♦ పరగదొక్క॥

ఉ॥ దేశమనంగ నందొదవి ♦ తేజరిలందగు వారలే కదా? ।
ఈశు ననుగ్రహంబునను ♦ నెల్లరు నీరము క్షీరమట్లులం ।
దాశయము ల్ఫలింప ముద ♦ మందుచు సద్గుణపౌర జీవితా ।
లాశ నొనర్చుకాలమెపు ♦ డైనను జూతువె భారతాంబికా॥

ఉ॥ నీలటు కాన్పురిన్గరిమ ♦ నిస్తుల తేజమెలర్ప జేరి పా ।
పాలును జంకు గొంకులును ♦ బాధగొుకించుక లేక యందజన్ ।
గాలునిపోల్ప జేర్పగను ♦ గట్టెను వంతెన మిత్ర శత్రు చం ।
శాల సమాన హత్యల యె ♦ డంగల తీవ్రశతఘ్ని ధారలన్॥

సీ॥ నిరపరాధుల వేల ♦ నీల్గంగనరకిన
తనమీది కోపంబు ♦ దరుగనాన ।
యానలేకమె జను ♦ లాబీచి చేరువ
నాంగ్లేయ యువతుల ♦ హతమొజేసి ।
రనిమెడి నెపముపై ♦ నఘదూరులైనట్టి
బ్రాహ్మణశ్రేష్ఠుల ♦ బలిమి పట్టి ।

నేలను నాకించి ♦ చాలను హింసించి
యురికంబముల బాగ్రి ♦ మూడ్చినంట ।

తే॥ గీ॥ శమదమాదుల వర్తించు ♦ శాంతజనుల ।
బలిమిజంపించు రాజ్యంబు ♦ బ్రతుకగలదె ।
ఆకసంబగ్ని గోళాల ♦ నట్టెయుమిసి ।
వీరిసంతతి మన్నుగా ♦ వింపకున్నె॥

ఉ॥ అంతట కాన్పురిన్ వదలి ♦ యాహవవీరుడు నాన యొప్పాయ ।
త్యంత విచిత్రవైఖరిని ♦ నాయతవీరులసేన కోడు రా ।
జెంత చిరూరు నామక వి ♦ శిష్టపురంబున జట్టునున్న యే ।
ప్రాంతము నందొడాగిరిపు♦వాహినుల న్నమయించు చుండగాన్॥

# ఢిల్లీయుద్ధం

శా॥ ఢిల్లీపట్టణమెల్ల సైన్యమయమై ♦ తీవ్రద్గగన్జాలెను ।
ద్యల్లీలామయ ధీరనాద నిబిడ ♦ ధ్వానంబునల్దిక్కులన్ ।
బెల్లైకర్ణ విభూషమై జన మనో ♦ వీధీ విరాజన్మహా ।
కల్లోలోజ్జ్వల దివ్యవీచికల శ్రీ ♦ కాంతా నివాసంబొనాన్॥

తే॥ గీ॥ దారులందున మత్తవే ♦ దండమెక్కి ।
మొగలు రాజన్య వంశ్యుడా ♦ భూవిభుండు ।
హిందు మొగలాయి భేదంబ ♦ దెందులేదు ।
దుష్టులౌ శ్వేతదుర్జాతి ♦ దుగ్రింపు డనెను॥

ఉ॥ ఏరికి నెట్టిసాయ మెప్పు ♦ డేవిధి గావలెనన్న నట్టులన్ ।
జీరికి గోరకే యొసర ♦ జేసెడు సీబహాదూర్ష నేడిదే ।
వైరుల జెండరందు మన ♦ వారల జంపెడి తెల్లజాతిదే ।
వేరులదెంచి మారణము ♦ వేడ్కనొనర్పుడి లెండు లెండనన్॥

ఉ॥ రాజ్యము లిచ్చివేసితిని ♦ రాజనునామము వద్దు మాకదే ।
భోజ్యము దేశదోహకర ♦ భూభుజులై తగు శ్వేతజాతి ర ।
క్తాజ్య విలిప్త భోజనము ♦ కావున సిక్కు మరాట వీర సా ।
మ్రాజ్యము జేయుడీ రిపుల ♦ మార్కొనుడీ ఘన వీర్యసంపదన్

చ॥ అనెబహుదూర్ష మానసము ♦ నార్ద్రితజేయు సుధాసమంబులై ।
చను మధురంపు వాక్సరణి ♦ జానపదంబుల బారికె నానుధుల్
ఘనబలయుక్త వీరుల ని ♦ కాయము జేరదిదేల తూత్రి భూ ।
జనవివహంబు మాత కప ♦ చారము దీర్పగరాదదేలకో॥

చ॥ ప్రతిదినమందు నాంగ్లజన ♦ పాలిత సైన్యముతోడ యుద్ధము ।
న్నతగతి గోట బాహ్యగహ ♦ నంబున జేయుచు సంజవేళలన్ ।
గతి కుటిలంబొనర్చిరిపు ♦ కంఠము లెల్ల శతఘ్ని బారికా ।
హుతిమొనరించు చుండిరిసు ♦ హోన్నతయుద్ధ కళావిరాజితుల్॥

తే॥ గీ॥ చేతనుండిన యాయుధ ♦ శ్రేణితరుగ ।
గ్రొత్త సేనలు తమ చెల్మి ♦ గోరకున్న ।
విజయలక్ష్మి సమార్జన ♦ వెలయదనుచు ।
నేల సైన్య మెఱుంగరు ♦ కాలమహిమ॥

సీ॥ కాన్పూరు నందుండి ♦ ఘనుడు హేవ్లకువచ్చె
దానప్డు కలకత్త † దాటికదిలె ।
పాటియాల యుధిష్ఠంధు ♦ వసుధాధిపులు సేరి
రటుపైని కల్సను ♦ పటిమ నడచె ।
నవసేనతో గూడ ♦ నడచె కాలిన్సను
హడ్సనుద్రోహుల ♦ కంతులేదు ।
కానింగుపట్టుతో ♦ కలకత్త వీడిపి
యాగలో గాపుండె ♦ నధిక దీక్ష ।

తే॥ గీ॥ బేరిలీసేన సీమచే సు ♦ వీరశ్రేణి ।

వారింకోవారు కోరాడ ♦ బరగిరంత ।
ఢిల్లిలో సేన యిరుపార్శ్వ ♦ మెల్లయెడల ।
బోరవలసి దయ్యె న ♦ పూర్వరీతి॥

ఉ॥ నాయకుడొక్కడున్ బురజ♦నంబుల యోధుల దండనాథులన్
బాయక వారి వారివగు ♦ భాసుర నిశ్చిత కార్య జాలమున్ ।
జేయగ జేసినన్ జయము ♦ చేకుఱదే యటుగాక మూఢులై ।
హేయ గుణంపు జ్ఞానలవ ♦ హీనుల చేతుల నాశమొందదే॥

ఉ॥ ఏబదివేల వీరులు శ ♦ తాధిక యుద్ధప్రసిద్ధ శౌర్య తే ।
జోబల శక్తి యుక్తులయి ♦ శోభిలుచున్నను నల్పహయాణ బా
హాబల పాలితంబయిన ♦ యాయుధసేనకు లొంగుటెట్లుకో ।
ధీబల ప్రాభవంబు గణుతింపగ ♦ దేహబలంబు మించుగా॥

తే॥ గీ॥ ఊహవాడ్సనురచియించు ♦ వ్యూహమందు ।
బడని స్వాతంత్ర్య సేనాని ♦ పడదుకనుల ।
ధనము తృష్ణయు మనముల ♦ దగిలి యున్న ।
దేశరక్షణకై పోర ♦ నీశువశమె?

సీ॥ కాశ్మీరు దర్వాజ ♦ కదలబారెను గర్గె
సజ్జమండిని ఘోర ♦ సంగరంబు ।
కోటగోడలనెక్కి ♦ క్రూరనికల్సను
డామె వేగుగ నేడి ♦ లాయిబక్షు।
పశ్చిమద్వారంబు ♦ పక్కవేచెను హాడ్స
నాపైన జీనతు ♦ నరయుగాదు ॥
అన్యప్రాంతమువార - లాహ్వానమిచ్చిరి
మనసేన వృద్ధియా - మనముచేర ।
తే॥ గీ॥ శత్రు సంహారమీనాడు - చక్కబడదు।
వేలుసీమల యుద్ధాల - వేగగెల్చి ।

విజయలక్ష్మిని జేపట్టి - వేడ్కమరల ।
బురముఁరావచ్చు మనమెల్ల - బోదమిపుడు॥

చ॥ అనియెడు బక్తుఖానువచ - నావళికడ్డి యిలాయి బక్షు పో ।
గనువలదంచు మాన్పి వెను - కందగ పాడ్సను పిల్చి ఖైదిగా ।
నొనరిచె రాజు సూనులను-నొయ్యనజంపి తదీయ మూర్ధముల్ ।
జనకున కంపె గాన్క-గను - జాల్మడుపాడ్సని కెంతక్రూరుడో॥

ఉ॥ ఆతని సంతతీసమయు - మందును బొందును ద్రోహబుద్ధిలే ।
దాతము పాదుషాహిని ను - దారుని నమ్మిన పాపకర్మ సం ।
జాతవిలాస వైభవ ప్ర - సాద సుఖంబుల నీతరంబునన్ ।
భూతలమందు బాపములె - భూరిసుఖోన్నతి కారణంబులా?

సీ॥ కనబడ్డ వారిని ♦ కరుణ నెఱుంగక
కత్తులతో జెండి ♦ కదలువారు ॥
ఇండ్లెల్ల గాలిచి ♦ యిండ్లలోపలివారి
నగ్నిలో ద్రోయుచు ♦ నరుగువారు ।
సుందరులను గాంచి ♦ చుట్టుముట్టుచు వారి
మానము ల్చెఱచుచు ♦ మసలువారు ।
ముసలివారిని జూచి ♦ యిసుమంత దయలేక
చిత్రలీలల వధ ♦ ల్సేయువారు ।

తే॥ గీ॥ ఒకనిమించి మఱొక్క-డే ♦ యోపినన్ని ।
క్రూరకృత్యంబులో చేసి ♦ క్రోధరాజ్య ।
చక్రవర్తిత్వ సంపద ♦ జతురులైరి ।
సిక్కు-లాంగ్ల పఠానుల ♦ సేనలపుడు॥

సీ॥ తమ దేశమున బుట్టు ♦ తమబోటి వారినే
చంపగా నొల్లరు ♦ సంశయంబు ।

నిరపరాధుల జంపి ♦ సరిలేని ధైర్యంబు
జాటించినట్టుల ♦ సంచరింతురి ।
పరుగెత్తువారల ♦ ప్రాణంబులను దీసి
పాపభీతి యొకింత ♦ పడరు మదిని ।
తమదేశపు స్వతంత్రి ♦ తను జంపువారలు
తామెకాయని యాత్మ ♦ దలపబోరు ।

తే॥ గీ॥ సిచమాపొట్ట నింపంగ ♦ నిరతి నెంత ।
పతితకార్యంబు లొనరించు ♦ నితర దేశ।
జనములెవరును నిమ్మాడ్కి ♦ జవిరటంచు ।
వినగలేదింక ముందును ♦ వినము నిజము॥

తే॥ గీ॥ పాడి యెఱుగని మొరకు శి ♦ పాయిలెవరో ।
తెల్లయువతుల నెటొ కడ ♦ తేర్చిరనుచు ।
గలుషహీనుల నందఱ ‡ నిలువబెట్టి ।
నాయకులు వీర లీరీతి ♦ నరకుటొప్పె॥

ఉ॥ వీధులనే యెడన్గనిన ♦ వేదనయుక్త కఠోర వాక్య సం ।
బోధనలే గృహావళి యు ♦ పూర్వ శవాలమయ్యె నెల్లెడన్ ।
వ్యాధిని రూఢగంధమయ ♦ వాయువు గ్లడ వీచె, ముందు నీ ।
సాధుజనాపకారక ప్రి ♦ శస్త్రి జగంబున నుండు నిట్లునాన్॥

తే॥ గీ॥ సాహెబుల సేన హైందవ ♦ సదనములను
సాహెబుల యిండ్లు హైందవ ♦ సైన్యములును ।
ఉభయులను సిక్కు తండంబు ♦ లభయవృత్తి ।
నఱకిరట గత్తి కోయక ♦ వఱలు వఱకు॥

సీ॥ నరుకగా బై జిమ్ము ♦ నల్లతుంపురుజల్లు ।
లావ్యాయి మనిపించు ♦ నత్తరనగ ।

జచ్చుచు నలిచెడు ♦ చకిత మానవనాద
మానందదాయక ♦ గానమనగ !
బాణరక్షణ బాఱు ♦ వారి పాదన్యాస
మనయంబు భరతనా ♦ ట్యంబుగాగ ।
కందంద పడియున్న ♦ యనదల నిచయముల్
సద్భక్తి నొసగుపు ♦ ష్పములు గాగ ।

తే॥ గీ॥ మృత్యుదేవత యతిభక్తి ♦ మెఱయ భువికి ।
గాలునాహ్వాన మొనరించి ♦ ఘనత గూర్చు ।
విందు దర్బారు బురుడించి ♦ వెలసె నపుడు ।
ఢిల్లిపట్టాభిరాజంబ ♦ దుల్లనువియ॥

ఉ॥ నాదరుపాయు త్రైమురు వి ♦ నా మన భారతభూమి నిట్టులన్ ।
బోదిని సర్వనాశన మ ♦ పూర్వగతి న్వ్యనరింప రెవ్వరున్ ।
బీదల నెత్తురేరులను ♦ భీషణ కాలమదేభ తుల్య స ।
మ్మోద విహారహారులంబు ♦ మూర్ఖత నెవ్వరు సిగ్గు మాలిరే॥

ఉ॥ పోయెనుఢిల్లియందలి య♦పూర్వ మహోన్నత వైభవంబులున్।
మాయము నొందె లక్ష్మి యస♦మాన విలాసవిహారభూములిం।
కేయడగన్న మృత్యువది ♦ యెల్లెడ నాట్యమొనర్చు చుండెగా।
హాయిగ బెద్ద నిద్దుర నొ ♦ యారముగా భువిదొర్లు పీన్గులే॥

సీ॥ చిదిమిన బాల్గారు ♦ చిన్నపిల్లల రక్త
నిచయంబులే యర్ఘ్య ♦ నీరమదిగ ।
ఎదిరిపోరున జచ్చు ♦ సదమల వీరులన్
బ్రవహించు రక్తంబె ♦ పాద్యమదిగ ।
నేపాప మెఱుగక ♦ యింగ్లీషులను నమ్ము
నలతుల కండలా హారమదిగ ।

దమసోదరుల గుట్టు ♦ దలజెప్పుద్రోహుల
నీచరక్తంబె పా ♦ నీయ మదిగ।

తే॥ గీ॥ జెలగు మంటల నీలెపో ♦ టులను నొక్క।
గ్రొవ్వుతోడను వేగు న ♦ రుల తనువులె।
భక్ష్యములుగాగ మానంబు ♦ బాయుచెలుల।
యేడ్పుపాటల మిత్తి చే ♦ యించె విందు॥

మ॥ అకటా లేడొకొ దేవుడీ జగతి హా ♦ హాకార సంక్షుభ్యమై।
ప్రకటోత్కృష్ట గుణాళిరావయిన యా ♦ ర్యావర్త దేశంబునన్।
సకళంక స్థితి జొచ్చి పాపయుత దో ♦ స్సారోద్ధతిన్ మించనా।
నాకాయీఆంగ్లకుమారయాయులిటుల♦యోగ్యయెంతపాపాత్ములో

# కాన్పూరి రెండవయుద్ధము వీరతంతియాతోపి

ఉ॥ ఇంతట గాన్పురిన్నరల ♦ నేర్పడనంచె మరాటి దండుతో।
దంతియ వీరుడన్నుడి ♦ తండములన్విన వచ్చె వేడ్కగాన్।
నంతనె యాంగ్లవాహిని స ♦ హాయము నర్పగ క్యాంపుబెల్లున।
త్యంత విశీర్ణ మానస భ♦యంబుల బొంది రటాంగ్లనాయకుల్॥

ఉ॥ అతడు కాన్పురిన్గలిచి ♦ యాంగ్లుల శౌర్య ప్రతిష్ఠనిల్పి వి।
ఖ్యాతిని బాసి ప్రాణముల ♦ నార్తి నొసంగిన వీరులీడమున్।
వేత్రయవస్థ మాన్పి కడు ♦ బ్రీతినొనర్చెను హిందు మానిసీ
చేతములన్నగల్పు బలు ♦ సీమలబారెడి రక్తధారలన్॥

సీ॥ తనదేశమును గాఢ ♦ తరపూజ్య భావాన
బ్రేమించినాడన్న ♦ పెద్దతప్పు।
తననాయకుండైన ♦ ధర్మాత్ము బీష్వాని
మాజీవితముగొల్చె ♦ ననెడి తప్పు।

ఉఃదీయు తటినైన ♦ నుత్సాహ చిహ్నమా
మొలకనవ్వులమోము ♦ గలుగుతప్పు ।
ఎంతవారెదురైన ♦ నిసుమంతమోసాన
గాని చిక్కకయుంట ♦ గడ్డుతప్పు ।

తే॥ గీ॥ దివ్యతర నిష్కళంకమా – తేజమమరు ।
జీవితము మాతృపాదాల – జెలగజేసి ।
వెలయు తండ్రిని రంతియా – వీరు మరువ ।
సాధ్యమా నాకు సాధ్యమా – చచ్చువఱకు ।

చ॥ నిజముగ జూచినాడ నిను ♦ నీటుగ శ్వేత తురంగ మెక్కి మా।
ప్రిజ నిజమా స్వతంత్రిగుణ ♦ రమ్యసురూపమొనాగ వీరుడై॥
నిజ పరివారప్రేమలను ♦ నేటికి గూడను జూఱగొన్న, య।
క్కజమగు నీదురూవ, మన ♦ ఘూభవదీయమరాటశౌర్యమున్

ఉ॥ నీవును జాన్సితల్లియును ♦ నిస్తులశౌర్యతరోగ్రియుగ్మమై।
కేవలరూపమందనగు ♦ కిల్బిషహీనపు పీర తృష్ణనాన్।
బ్రావృషమందు మర్దన ప్రి ♦ భావసితాసినదంగజేయు సం।
భావిత దివ్య తేజమగు ♦ వైభవరూప విశేషమెంచెదన్॥

## జాన్సి లక్ష్మీ బాయి వర్ణన

సీ॥ ఉదయకాంతులలోన ♦ నుద్యత్ప్రభలమించు,
నరవిచ్చుకనుదమ్ము ♦ లబ్జములఱ।
నీరెండరుచులలో ♦ నెమ్మోముతీరులా,
యస్త్రాద్రినినఃనిశో ♦ నేస్త్రమంద।
తీవ్రభావములలో ♦ దేలియాడెడు మనం
బశ్వవేగస్ఫూర్తి ♦ నవఘుళింప।
దొలికాఱుమొగిళుల ♦ తళుకున్న మెఱపును,
జంద్రహాసకరంబు ♦ సాకుబట్ట।

తే॥ గీ॥ [illegible] ♦ లెచటగన్న।
నట్టియెడలనె కనిపించి ♦ బిట్టువెలయు।
శక్తిసమభవ్యలక్ష్మి ప్రి ♦ శస్త్రమూర్తి।
మఱపునకురాదు నీరూపు ♦ మహిమ తల్లి॥

ఉ॥ ప్రిక్కను మందరన్ గరిన ♦ ఫక్కిశిపాయికరాసి జంప, నీ
ప్రిక్కనె వేతురాతోకడు ♦ బగ్గిలినీపంబు విక్రిమింప నీ।
వొక్కతెప్రిటిన్మహత్తరస ♦ ముజ్వలశక్తిని రెండువైపులన్।
జిక్కక యిద్దఱన్ నఱకు ♦ శ్రేష్ఠప్రితాప విశేషమెంచెదన్॥

ఉ॥ రివ్వనవచ్చిలోయదరి ♦ రింఖల జేర్చి మఱొక్కలంఘనన్।
దవ్వులనున్న శత్రులట ♦ దద్దరిలింగను జేయకేల, నీ।
చివ్వలమిండడైన హరి ♦ శ్రేష్ఠతనెల్చె స్వతంత్రి నామపున్।
బువ్వల మాతృపాదముల ♦ బూజలొనర్పగ నోచవైతివే॥

తే॥ గీ॥ ఇంతలో నినుజేరిన ♦ యింగిలీషు।
రాతులొక వేటునను వాజి ♦ నాతివనక
నిన్నునొక వ్రేటుననుగూర్చి ♦ చన్నదృశ్య।
మెలమి నేహింపవైవను ♦ గలడె మఱువ।

ఉ॥ చూచితి దివ్య సాహస ప్రి ♦ శోభితకాంతులు పిక్కటిల్లగా॥
నూచుచు జేతిఖడ్గమున ♦ నుజ్జ్వలరీతిని శత్రుకోటులన్।
దూచమొనర్పునీ దయిన యూర్జితవీర విహారకేళి, నా
నోచిన నోము పండుటను ♦ నూల్కొను బాల్యదశన్ యశస్వినీ॥

ఉ॥ ఏమివచింపగావలయు ♦ నింకను హూణులుసిక్కు వీరులున్॥
శ్రేమనుపీడి స్వేచ్ఛమెయి ♦ బెక్కు శిపాయిల జిత్రిరీతులన్॥
నీమములేని చందమున ♦ నిర్దయరాక్షసజాతి మించియే।
మేమువొనర్చిరో తెలియ ♦ కే యొనరించిరి క్రూరకృత్యముల్॥

తే॥ గీ॥ ఉపకరించుచు సాహసి ♦ యనుచరుండు।
వీరవరుడౌ కుమారుండు ♦ విమలవీర్య।
సాహసంబుల జూపించి ♦ చాటుకీర్తి।
దిక్కులను జల్లి చేరెరి ♦ దివము పుత్రి॥

చ॥ కరమది శత్రుఖడ్గమున ♦ ఖండితమైనను బ్రిగ్రహంబులన్।
దిరముగ బంటనూదికడు ♦ ధీరతమూరుకరంబునన్ రిపుల్
నిరవధిక ప్రతాపమును ♦ నిశ్చలత న్వెలిగంది చూడను।
స్థిరుడయి యుద్ధభూమినతి ♦ తేజము జూపుకుమారుడల్పుడే॥

ఉ॥ ఇట్టి మహామహుల్ గణన ♦ కెందఱొ యున్ననుయుద్ధమందు సం
దెట్టి జయంబుగల్గకటు ♦ నేడ్తెగనుంచుట తప్పె, దూలము।
ద్దిట్టము లైనవెన్నయిన ♦ దీవ్రభరంబును మోయజాలునే।
గట్టియయోమయంపుదును ♦ కల్దము జేర్చిచెలంగకున్నచోన్॥

చ॥ అవధయుబోయె లక్ష్మణ మ ♦ హామహు పేరిటిపట్టణంబునన్।
బవరమునందు నోడె; కడు ♦ బల్మిని కాన్పురిలోంగ ఢిల్లియున్
బ్రివిమఁ కీర్తి బాసి, తన ♦ వైరులపాదములన్ భజించె హైం॥
దవజనయిత్రిబాపుటను ♦ దావెటను గ్గనతాదభాగ్యమై॥

## జడదారి — నానా

సీ॥ ఎలప్రాయమందునే ♦ యే నదిపుగునో
వనభూమిఁ సుందర ♦ తనుడితండు।
కళబాసియున్నదే ♦ కంజసన్నిభవాన,
వదనంబు ఘనచింత ♦ వఱలుచుంట।
భార్యబిడ్డయు లేర ♦ పాఱిపోయెడి వీని,
తనువల్లిబోషింప ♦ దగినరీతి।
తపముజేయగబూను ♦ తనుదేలి సాధింప,
జిత్తంబు నిలువగా ♦ జేయలేడొ॥

తే॥ గీ॥ యనుచు దనుగన్నవారెల్ల ♦ నార్తిబొంద।
హిమనగంబునవనులందు ♦ భ్రమనుదిరుగు।
'నాన' గని వన్యజనములు ♦ ననగుచుండ్రి।
వత్సరంబేగ నెన్నియో ♦ వత్సరములు।

తే॥ గీ॥ అనుచు ముగియింప నుద్యుక్తు ♦ డైన కథను।
నాపజూచెడు ఘనుడగు ♦ త్ర్యంబకుండన
దొ్రిసికొని వచ్చెలోనికి ♦ దోనెయపుడు।
ప్రక్కగదినున్న స్నేహిత ♦ ప్రవరుడొకడు।

## బిస్కే అఖాత ప్రయాణము

ఉ॥ మిన్న నెమధ్య భూవనధి ♦ మోదమెలర్పగ దాటి పోర్చుగల్।
సన్ననితీరసీమలను ♦ చండతరంబగు ధాటిదాటి, యా।
పన్నులమైతి మిద్దియెయ ♦ సాధ్యపుగాలులకిక్క బెస్కె నీ।
వెన్నగనింకబైన సడ ♦ లింపుమ దొప్పము మాంసభక్షణన్॥

తే॥ గీ॥ ఇట్టి చలిగాలులందున ♦ నెట్టివారు।
శాకహారాన బ్రతుకగా ♦ జాలరనిన।
జదువులేకున్న బోయెద ♦ జననిదరికి।
ననినమాటను దప్పగా ♦ దనియెగాంధి

## లండను ప్రవేశము

ఉ॥ ఇంకను నేబదేమయిళు ♦ లేగినలండనువచ్చు నాయెడన్।
సంకటమకాచు వస్తువుల ♦ జక్కగగాతు నొసంగకున్న, వ
ల్యంకల నాదుమానసపు ♦ వాంఛను దీర్పగబోయి చెచ్చెరన్।
జంకునొకింత లేకయె ప్ర ♦ శాంతత మాయిలు సేరగాదగున్।

క॥ అప్పటికి నన్ని సరుకులు।
నిప్పటిలాగున నెకూర్చి ♦ యేర్పడ మీకున్।
దిప్పటలు లేని వడువున।
మెప్పుగ నందింతుమనిరి ♦ మేటి కలాసుల్॥

క॥ ఈవిధిని లండనే గను।
భావంబున మాతయాజ్ఞ ♦ బలుమఱుదలచున్।
జీవనము తనువు చదువును।
సేవగసనురీతి వెలయ ♦ నేర్పడుఃనుచున్॥

## లండను జీవితము

సీ॥ రాజాధిరాజులు ♦ రంజిల్లు హార్మ్యంబు
విక్టోరియా సౌధ ♦ వేదికలను।
శాకాదిహారమే ♦ శ్రద్ధమైనమరించు,
బాగైన హోటలు ♦ భాగములను।
దమవారి రీతినే ♦ దయతోడదను జూచు।
మధ్యకుటుంబిక ♦ మధ్యములను।
సురుచిరమైనట్టి నెరవులు సాధించు
స్వప్రయోగోచిత ♦ వాసములను।

తే॥ గీ॥ ఎటులనుండునో తెలియంగ ♦ నెఱిగివాని।
నంటినటులున్న నంటక ♦ యుంటఃజిగి।
తనరు నియమాల బాటించి ♦ తనరుచుండి।
దేహయాత్రల గడిపెడు ♦ తీరులరయు॥

తే॥ గీ॥ ఉదయమున మూడునవరసు ♦ లొసరనిచ్చి।
చేయుభోజనమిడలేని ♦ చేవయెటుల।
వారమునకొక్క నవరసు ♦ వలనగలుగు।
ననియు మదిలోన నాశ్చర్య ♦ మందునతడు।

తే॥ గీ॥ లక్షలును గోట్లుచేసి చె ♦ లంగు దివ్య।
వజ్రవైడూర్య భూషిత ♦ భవన మిడని।
శాంతచిత్తత సౌఖ్యమె ♦ సంగదొక్కొ?
ఋషుల యాశ్రమసీమలో ♦ నెలమినున్న॥

ఉ॥ లండనునందుయద్విథక♦ లాపమునందున సాయమొందగా।
నుండినదాదతో దగిన ♦ యోపికతోడను విన్నవించినన్।
నిండుకృపారసం బొలయ ♦ నేర్చునతండు సహాయమీయనె।
వ్వండటు చేయనోపనియ ♦ పారక్రియానిపుణత్వ మేర్పడన్॥

చ॥ అనుచును గాంధికిన్ మిగుల ♦ నాదరమేర్పడ జాబొసంగనా॥
యనయునునెట్టిసాయమును ♦ నాతనియొద్దనుగోరకుండియున్।
జనియెను బెక్కుమాటలు ప్ర ♦ జానివహంబులతోడదాపశో।
భనతర దివ్యభాషణ ప్ర ♦ భావముజూడగనెన్నొ తావులన్॥

శా॥ శాకాహారులతోటి స్నేహమును వా ♦ నంబున్దగజ్జేసి, యు!
స్తోకంబైన మనోబలంబొనరగా ♦ శోభిల్లి న్యాయాగమా।
నీకంబుల్పఠియించి వానివగు సం ♦ దేశంబుల నొ్బల్చుచున్।
రాకా చంద్రునికాంతి వృద్ధికనులీ ♦ లన్ ధీక్రమంబొప్పగాన్॥

సీ॥ తోలుదొ ల్త నాంగ్లుల ♦ తోటి సంభాషణ
వొనరింప సిగ్గుచే ♦ నూరకుండు।
వేషభాషణలందు ♦ వేడ్కమై వారిలో
సమలీల వర్తించు ♦ చతురతగను।
వాయులీనాభ్యాస ♦ ప్రథితనాట్యపులీల
విన్నాణముల నెల్ల ♦ వెలయనేర్చు।
ఆంగ్లకన్యలతోడ ♦ ననునైనరీతిని;
జాకచక్యవిలాస - సరణి నెఱపు।

తే॥ గీ॥ మాతతో నన్నమాటల ♦ మదిదలంచి।
దేశమర్యాద విధముల ♦ దెలిసికొనుచు।
గత్తిపై సాము సేనరించు ♦ కౌశలంబు।
జూపులీలల బాలుండు ♦ సారిదినొప్పు॥

ఉ॥ పెండిలికాని వాడనుచు ♦ ప్రేమసుధామహిమంబెఱుంగకే।
యుండెడి వాడటంచు దను ♦ నుత్తమజీవిత సౌఖ్యపూరమం॥
దుండెడియంచజేయగను ♦ నుర్వెళులూరెడి యుక్తకాంతలన్।
మెండుకరంగ జేయు దన ♦ మేలగు బాల్యవివాహవర్ణనన్॥

# బార్ - అట్ - లా - వ్యాసంగము

సీ॥ న్యాయసూత్రాన్విత ♦ వ్యాసంగరతుడౌచు।
రోమను లాలోని ♦ రుచిని జూచు।
రాజ్యనిర్మాణంపు ♦ రమణీయ తలజూపు
గ్రీసుదేశ విశిష్ట ♦ రీతినరయు।
వ్యక్తి స్వతంత్రితా ♦ వైభవంబును జూడ
నింగ్లీషు లారీతు♦లెల్ల నరయు।
కంటాక్టులోనున్న ♦ కాఠిన్యమును జూడ,
వివిధ సంస్థలవృద్ధి ♦ విధములరయు।

తే॥ గీ॥ సివిలుక్రిమినలులాలలో ♦ జెలగుచున్న।
చిక్కులనుగాంచి ప్రతిక్రియ ♦ చిక్కులరయు।
సత్యనిరతుల పద్ధతుల్ ♦ సాగునొక్కొ।
యనుచుదర్కించు మదిలోన ♦ నతడు తలచు॥

సీ॥ ముట్టిన బాటరీ ♦ యట్టులభావించు
గనులెత్తనెటికెట్టు ♦ కాదొయనును।
ప్రిక్కంటి కేగుట ట్రిస్పాస్సెయగునను,

గుణదోషములనెంచ ♦ గొఱతయశేము।
ఆజ్ఞలబాలింప వ్యక్తిత్వలోపంబు,
వినకున్నలాలేక ♦ వెలయుటగును।
దర్శిత వ్యాజ్యంబు ♦ తథ్యంబుగాకుండు।
సాక్ష్యహీనంబగు ♦ సత్యమునకు।

తే॥ గీ॥ ఔరయింతసున్నితమౌనె ♦ న్యాయపథమ
టంచు దర్కించి మదిలోన ♦ నరయుతత్త్వ।
మాదరాయత్తచిత్తుడై ♦ యనవరతము।
న్యాయతత్త్వ పిపాసియౌ ♦ యలతివాడు॥

ఉ॥ న్యాయపథానుయాయులగు ♦ నర్చకులేగెడు విందులన్నిటిన్॥
బోయియథాతంథబుగను ♦ బోధితశాస్త్రముల న్గ్రహించుచున్॥
స్వీయపథంబువీడకయ ♦ చెల్మిని మాతకొసంగు బాసలన్। ।
బాయకయాచరించుచుబ్రి ♦ భాయుతుడౌచునుగాంధిపొల్చెడున్

సీ। రోమనులాకయి ♦ రుచిమీఱలాటిను,
నభ్యాస మొనరించె ♦ నధికరక్తి
ఐరోప భాషలం ♦ దౌన్నత్యమొందిన,
ఫ్రెంచిని బఠియించె ♦ ప్రేమమీఱ
జ్ఞానవృద్ధికిగాను ♦ గౌతుకంబదియెచ్చ
లండను మెట్రిక్కు ♦ లలిని జదువు।
హిందువైహితులకు ♦ సందేహములబాప,
గీతలబఠియించు ♦ నీతిమెఱయ।

తే॥ గీ॥ అలతిమాటలలోపలే ♦ యడరియుండు।
సత్యమనునీతి నెఱిగెను ♦ జతురగతిని।
సీమబారిస్టరీ కత్యు ♦ జేరియతడు
భార్యతోభత్యముల బెండ్లి ♦ బడయునటుల

ఉ॥ ఎందఱో శీలముగ్ధులయి ♦ యీతనివారి మతమ్ములోనిదా।
నందమునెందుగానవని ♦ యాదరభావమునోడ బిల్వగా।
నెందునదాజవించెనది ♦ యింతయెఱుంగక చేరనన్యమున్।
సుందరి నింటడించి పెఱ ♦ సుందరిగూడుట తుల్యమంచనున్॥

శా॥ శాకాహారము మాతమాటపయినా ♦ శావేశతన్పూని, యా।
పైకాంతుల్ ఘనశాస్త్రముల్పదివియ ♦ వ్యాసిద్ధగందీని నే।
సాకల్యంబుగగాంచి జీవితపు బ్రా♦ శస్త్యంబులీసూత్రముం
దేకాకారత నాచరించునియమం ♦ బెల్లప్పుడు న్గ్రాలెడిన్॥

చ॥ అనుఘనభావతత్పరత ♦ నాయెలప్రాయపు బాలుడప్డు తా
ననితర సాధ్యధీగరిమ ♦ నచ్చటిసంఘపు గార్యదర్శియై।
ఘనసభయందు ముఖ్యుడయి ♦ గౌరవమందుచు జాలనొప్పెమ
న్నన హితబృందపేమలన ♦ నారతముగ్గని యార్జితంబుగాన్

చ। సఖుడొకనాడు ప్రక్క-ధియ ♦ సానికుహాలునకేగబిల్వగా।
సుఖగతినేగి యచ్చట వి ♦ శుద్ధపు భావపరంపరాహతిన్॥
ప్రఖరమునెన్న జీవనపు ♦ బద్ధతిలోన ఋతంబులన్నిటన్।
ముఖరవచః ప్రచారముల ♦ మోఘముమానససీమనాటగన్।

ఉ। 'లా' చదువంతపూర్తియగు ♦ లాగుననుండి కృతార్థుడైన నా।
లోచనజేసె నాతని క♦ ళోన్నత రూపము వాక్యజాలమున్।
యాచనసేయు, వృత్తిని జ ♦ యంబునొనర్చెడి రీతులన్నియున్
జూచియెఱుంగగోరి తగు ♦ చోనటనే ఘనులైనవా రినిన్॥

ఉ॥ నీకుభరింపజాలవను ♦ నిష్ఠురకష్టముగల్గువేళలన్।
నీకునొనర్పగాదగున ♦ నిందితరీతిని సాయమెద్దియో।
సాకులులేకయే యొనర ♦ జక్క-నొనర్చెద నంచుదాద యు।
ద్రేకముతోడ బల్కు-నుడి ♦ తీరుదలంచెను మోహనుండొగిన్

ఉ॥ ఆయనయొద్దకేగి తన ♦ కబ్బిన క్లిష్టసమస్య లెల్లనున్।
బాయక చిక్కులేనటుల ♦ బాగుగ పద్ధతి జేయ నేర్చెనే।
బోయెద మాతృదేశమున ♦ బూర్తిగ మీవచనాల భక్తితో।
నాయెదలో లిఖించియున ♦ నారతము న్వెలుగొంద జేసెదన్॥

తే॥ గీ॥ అనుభవించియుంతునని నేడె ♦ యరుగువాడ।
లేమ శేపేగుదునటంచు ♦ లీలజంకు।
నితరులను జూడబోవ్రు మ ♦ చింతకన్న॥
నేమి చెప్పను దాదని ♦ యెందిరిలము॥

ఉ॥ మిత్రులు వింటజేసి తను ♦ మిక్కిలి సంస్తవముం బొనర్ప, నా।
మైత్రిపరిసంగమంపు ఘన ♦ మాధురితోడను బల్కనిల్పియున్
గాత్రము చెమ్మగిల్లగను ♦ గంఠము రామిని వందనమ్ములన్।
మిత్రులనందు కొండనుచు ♦ మెల్లగ లేవకె గాంధి యుక్తిసైః॥

తే॥ గీ॥ మూడు సంవత్సరంబుల ♦ మోఘురీతి॥
జనిని బ్యారిష్టరై యుండి ♦ సారమతిని॥
సిగ్గుభయమును గెలుపొంద ♦ జేతగాక।
యున్న యితడేమి చేయగా ♦ నున్నవాడొ॥

ఉ॥ ఆవిధి దావతో గలియ ♦ నేగకయేమని నెంచెనిండియా।
బోవగమోహనుండు హృది ♦ బొంగుచు నిశ్చయముం బొనర్చెదా।
సేవయొనర్ప మాతృపద ♦ సీమల జేరగ గల్గునంచు నా।
పావనమూర్తి శీతల కృ - పారసవృష్టిని దోగ గోరుచున్॥

శా॥ ఏదోరీతిని మూడువత్సరము ♦ వ్యక్షిట్లో సంపూర్తిగా।
నీదౌ నాజ్ఞల నౌదలన్నిలిపితి ♦ న్నిండాను వాత్సల్యము।
న్నాకా పార్శ్వము జూడుమా యనుచునే ♦ తన్మాతృమూర్తిన్ దగన్
బాదాబ్జంబుల మొక్కి యుత్సుకతతో ♦ బల్కంగ నానంచొగిన్

తే॥ గీ॥ తనకు బారిష్టరీపట్ట ♦ దనరుదినము।
మళ్ళినోలేదొ, నౌకలో ♦ మాతృభూమి।
పయనముంజేయు నేర్పాటు ♦ బరగజేసి।
యాంగ్లదేశంబు మోహాను ♦ డంతవీడె॥

చ॥ సదమలకాంతి యుక్తమగు ♦ సారమణిప్రవరంబుశాళ్ళలో।
నొదవెను దానినేర్పఱచి ♦ యుంపకజాతిని లోగుఱాలలో।
వదలిన నేసమున్నతికి ♦ వచ్చునొదివ్య ప్రభావిశేషముల్।
పదహతి దుమ్ముధూళిబడి ♦ పంకనిమగ్నత నగ్గిపోవునో॥

సీ॥ స్వచ్ఛోదకపుతావు ♦ సరసాక్కటుండెనొ,
బకరాజియుత్కర్ష ♦ బ్రతుకునచట।
నాబకంబుఃలోన ♦ నడరుమరాళంబు,
తెలికాంతి వానిలో ♦ దెలియకుండె।
మత్స్యాది జలచర ♦ మండలిమెసవక,
నలినవనులయందె ♦ మెలగునదియు।
క్షీరనీరవిభాగ ♦ చేష్టలనదిగన
బకశ్రేణి వద్దాని ♦ బడయదయ్యొ।

తే॥ గీ॥ నిరుపమానంద జీవన ♦ నిరతినుండి।
లోకకల్యాణశాంతికై ♦ వీకనుండి।
శృతిహితంబగు గీతంబు ♦ శోభబాడ।
బకము లద్దాని క్రోధాన ♦ బట్టునేమొ॥

ఉ॥ కాలముదాటె బండి తప్పె ♦ కాండ మహాత్ముని జీవితంబు న।
క్ఫాలవికాస వైఖరి, య చింత్యపు ♦ సత్యపథానురక్తియే।
లీలలనింతలింతలయి ♦ శేకులవిచ్చి సుగంధవాసనల్।
చాలగది జృంభంబుల బ్రి ♦ సారణనొందెనొ తేల్పు రేపటన్॥